# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 5 మే 1994 సంచిక 10

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం

**Goldfish** 1901-02 71¼" X 26¼" Private Collection

*Klimt originally wanted to call this picture 'To my Critics', intending it as a riposte to those who had attacked his ceiling painting for the University of Vienna; the figure at the base who turns towards the spectator with a look of blatant sexual invitation is very similar to one in* Medicine *(p.2500) that he eventually painted over. When the picture was shown at Düsseldorf in 1902, it was attacked by the critics and, as one contemporary recalled, it was 'requested that the Ministry of Education remove the painting before the beginning of the exhibition, for the German Crown Prince who was to open it might be shocked.'*

---

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Phrenology, *n.*** The science of picking the pocket through the scalp. It consists in locating and exploiting the organ that one is a dupe with.

**Physician,** *n.* One upon whom we set our hopes when ill and our dogs when well.

**Physiognomy,** *n.* The art of determining the character of another by the resemblances and differences between his face and our own, which is the standard of excellence.

> "There is no art," says Shakspeare, foolish man,
> "To read the mind's construction in the face."
> The physiognomists his portrait scan,
> And say: "How little wisdom here we trace!
> He knew his face disclosed his mind and heart,
> So, in his own defence, denied our art." *Lavatar Shunk.*

***Piano, n.*** A parlor utensil for subduing the impenitent visitor. It is operated by depressing the keys of the machine and the spirits of the audience.

**Pickaninny, *n.*** The young of the *Procyanthropos*, or *Americanus dominans*. It is small, black and charged with political fatalities.

**Pie, *n.*** An advance agent of the reaper whose name is Indigestion.

> Cold pie is a detestable
> American comestible.
> That's why I'm done - or undone -
> So far from that dear London.
> *– From the Headstone of a British Nobleman, in Kalamazoo.*

**Piety, *n.*** Reverence for the Supreme Being, based upon His supposed resemblance to man.

> The pig is taught by sermons and epistles
> To think the God of Swine has snout and bristles.
> *Judibras.*

***Pig,*** *n.* An animal (*Porcus omnivorus*) closely allied to the human race by the splendor and vivacity of its appetite, which, however, is inferior in scope, for it sticks at pig.

**Pigmy, *n.*** One of a tribe of very small men found by ancient travelers in many parts of the world, but by modern in Central Africa only. The Pigmies are so called to distinguish them from the bulkier Caucasians - who are Hogmies.

**Pillory, *n.*** A mechanical device for inflicting personal distinction - prototype of the modern newspaper conducted by persons of austere virtues and blameless lives.

**Piracy, *n.*** Commerce without its folly-swaddles, just as God made it.

**Pitiful, *adj.*** The state of an enemy or opponent after an imaginary encounter with oneself.

**Pity, *n.*** A failing sense of exemption, inspired by contrast.

**Plagiarism, *n.*** A literary coincidence compounded of a discreditable priority and an honorable subsequence.

**Plagiarize, *v.*** To take the thought or style of another writer whom one has never, never read.

**Plan, *v.t.*** To bother about the best method of accomplishing an accidental result.

# దేశదేశాలలో ఆంధ్ర సంస్కృతి

- శ్రీ భట్టిప్రోలు హనుమంతరావు

దేశదేశాంతరాలలో విస్తరించిన తమ సంస్కృతి ప్రభావ విశిష్టతను తలపోసి గర్వించని ఆంధ్రుడుండడు. కాని, ఆంధ్ర సంస్కృతి భారతీయ సంస్కృతిలో అంతర్భాగంగా వికసించి యుండటంచేత, దేశంలోని ప్రతి ప్రాంతం వారును, విదేశాలకు సంస్కృతిని ప్రసాదించిన గౌరవం తమదేనని భావించటంలో ఆశ్చర్యం లేదు. ఆ కారణంగా, భారత సంస్కృతి సామ్రాజ్య నిర్మాణగాథలో ఏ ప్రాంతంవారి పాత్ర ఎంతవరకో నిర్ణయించటంలో వాదోపవాదాలు సహజంగా ఉన్నై. ఐనప్పటికీ, భారతీయ సంస్కృతిని గురించి చెప్పే సందర్భంలో, 'భిన్నత్వంలో ఏకత్వం' అనేమాట తరుచు వింటూ ఉంటాం. అంటే, ప్రతి ప్రాంతానికి ఏదో ఒక విశిష్టత ప్రత్యేకత ఉండనే ఉన్నది. కాబట్టి విదేశాలలో విస్తరించిన భారతీయ సంస్కృతిలో ఆంధ్రుల పాలు ఎంతవరకో నిర్ణయించటం అంత కష్టంకాదు. ఇలా నిర్ణయించటంలో కేవలం వాఙ్మయ (Literary) నిదర్శనలకంటె పురాతత్వశాస్త్ర (archaeological) నిదర్శనలే ఎక్కువ విశ్వాసయోగ్యములైనవనీ, ప్రామాణికములనీ పండితుల అభిప్రాయము. వాని ఆధారంతోనే ఆంధ్ర సంస్కృతి విస్తరణను నిర్ణయించవచ్చును.

## విదేశ సంబంధాలు - కారణాలు :

సిరిసంపదలతో తులతూగుచున్న ఆంధ్రదేశానికి ప్రాచీన కాలంనుండి దూరదేశాలతో వాణిజ్య సంబంధాలుండేవి; పంటలు విరివిగా పండుతూండేవి; ప్రజలు వృత్తి సంఘాలు (శ్రేణులు)గా ఏర్పడి లోహ, వజ్ర, దారు, వస్త్ర పరిశ్రమల నభివృద్ధి చేశారు. సాతవాహనుల శాసనాలలో 19 వృత్తి సంఘాలు పేర్కొనబడినై. సాతవాహనుల నౌకాబలానికి, వారు విదేశ వాణిజ్యానికి కొనసగిన ప్రోత్సాహానికి వారి నౌకాచిహ్నముగల నాణెములే నిదర్శనము. ఆంధ్రదేశములో వినుకొండ, నెల్లూరు, నాగార్జునకొండ, కొండాపూర్ మున్నగుచోట్ల రోమను చక్రవర్తుల నాణెములు పెక్కు లభించినవి. ఇవి ఆంధ్ర దేశములో తయారైన వస్తువుల ఎగుమతి ద్వారా వచ్చినవేనని డా. రాధాకుముద ముఖర్జీ గారి అభిప్రాయము (Indian Shipping). ఈ విదేశ వాణిజ్యమునకు తూర్పుకోస్తాలోని మానార్పా (ఘంటసాల), కొద్దూర (కోడూరు), అల్లొసైన్ (కోరంగి), మైసలియాన్ (మచిలీపట్టణం) మొదలైన రేవులు కేంద్రములైనట్లు క్రీస్తు శకారంభమున ఇండియాను దర్శించిన ప్లినీ, టాలెమీ అను గ్రీకుచరిత్రకారులు పేర్కొనినారు. క్రీ.శ. 78 ప్రాంతంలో పేరు తెలియని గ్రీకు నావికుడు రచించిన "ఎర్ర సముద్రముపై దినచర్య" (Periplus of the Erthrean Sea) అనే గ్రంథంలో నాటికే దాక్షిణాత్యులు తూర్పు ఆఫ్రికా తీరంలోనూ తూర్పు ఆసియా దీవులలోనూ వలసలు స్థాపించినట్లు చెప్పబడింది. ఇండియా ఇండోనేషియా శిల్పములను గురించి పరిశోధనలు చేసిన డా. ఆనంద కుమారస్వామిగారి నిర్ణయము ప్రకారము, తూర్పుదీవులలో ప్రథమ భారతీయ వలసలు స్థాపించినవారు ఆంధ్రులు; వీరు కృష్ణా ముఖద్వారమందున్న కోడూరు నుండి బయలుదేరి, ఆ దేశాలకు వెళ్లారు.

వాణిజ్యం ద్వారా నేర్పడిన ఈ విదేశ సంబంధాలు బౌద్ధమత ప్రచార కాంక్షతో మరింత బలపడినై. జాతి, వర్ణ విచక్షణల ఆధిక్యతను నిరసించి, శాంతి, సమత్వము, సౌహార్ద్రములను పెంపొందించు బౌద్ధ ధర్మాన్ని తూర్పు ఆసియా ప్రజలాదరించారు. అశోకుని మరణానంతరం, భారతదేశం మొత్తంమీద బౌద్ధానికి రాజాదరణ సన్నగిల్లినదని చెప్పవచ్చును; శుంగ, సాతవాహన వంశముల కాలంలో తీవ్రమైన వైదిక ధర్మోద్ధరణోద్యమము విజృంభించింది. ఇక్ష్వాకులు కూడా శైవ సంబంధమైన హిందూ మతాభిమానులు; పల్లవుల కాలంలో పాశుపత, కాలాముఖాది తీవ్రవాద శైవం ప్రబలమై బౌద్ధమతాన్ని హింసించసాగింది. ఈ వాతావరణంలో బౌద్ధులకు మాతృదేశంలో కంటె తూర్పుదేశాలలోనే ఆదరాభిమానాలు లభించినవి. తమ మతాన్ని, శిల్ప సంప్రదాయాలను తీసుకొని, బౌద్ధులు అసంఖ్యాకంగా తూర్పుదేశాలకు తరలిపోయి వలసలు స్థాపించుకొన్నట్లు తెలుస్తున్నది. ఈ విధంగా నేర్పడిన వలసలు ఆంధ్ర సంస్కృతిని ఆ దేశాల ప్రజల కేవిధంగా పంచి పెట్టినది పరిశీలిద్దాం.

## తూర్పుదేశాలు

**బర్మా :** క్రీ.పూ. 5వ శతాబ్దంలోనే తెలాంగులనబడే మాన్ ప్రజలు బర్మాలో ప్రవేశించారు. వీరు తెలుంగుదేశం నుండి వలస వెళ్లినట్లు వారి పేరే సూచిస్తున్నది. వీరు రామన్న దేశమనే రాజ్యాన్ని స్థాపించారు; దాని రాజధాని హంసవటి (పెగూ). దీనికి కొంచెం ఉత్తరంగా శ్రీ క్షేత్రమనే రాజ్యం వెలసింది. దీనినే 'వనవాసి' అని కూడా వ్యవహరించేవారు. దక్షిణదేశంలో ''వనవాసి'' (ప్రస్తుతం మైసూరులో ఉంది). సాతవాహన సామ్రాజ్యంలో నొక విభాగమై, చుటుకుల శాతకర్ణి వంశస్థులచే పాలింపబడేది. క్రీ.శ. 6వ శతాబ్దంలో పెగూ రాజ్యాన్ని పాలించిన ''శాన్‌లాన్‌క్రోం'', ఇంచుమించు అదే కాలంలో వేంగి, కళింగ రాజ్యాల నేలిన శాలంకాయన రాజవంశ శాఖీయుడేనని భావింపబడుచున్నది. ఇతని వంశమువారే బర్మాలో బౌద్ధమతాన్ని ప్రవేశపెట్టారని ప్రసిద్ధి. డా. నీహార రంజన్‌రాయ్ పరిశోధనల ప్రకారం బర్మాలోని బౌద్ధమతం అమరావతి - నాగార్జునకొండల ప్రాంతం నుండి వెళ్లినదే. బర్మాలో ప్రచారమందున్న 'లోకతిష్య' అర్థకథకును, తెలుగుదేశంలో వాడుకలో నున్న కొల్లేటి దహనం కథకును లేశమైనా వ్యత్యాసం కన్పించదు. ఇటీవల ప్రోంలో కింబాగోన్ అనేచోట క్రీ.శ. 6వ శతాబ్దికి చెందిన బౌద్ధ స్తూపం బయల్పడింది. అందు బుద్ధవిగ్రహాలకు అమర్చబడిన చేతి ఉంగరములు, చెవి కమ్మలు ఆంధ్ర శిల్ప ప్రభావాన్ని చాటుచున్నవి. అచటి శాసనములు క్రీ.శ. 5వ శతాబ్దానికి చెందిన తెలుగు - కన్నడ లిపిలో వ్రాయబడినవి.

**మలయా :** మలయాలో నేటికి కూడా విదేశీయులను క్లింగ్ (కళింగ)లని పిలుస్తారు. దీనిని బట్టి మలయాలో ప్రవేశించిన మొదటి విదేశీయులు కళింగులని తేలుచున్నది. కళింగనుండి విదేశాలకు వలస వెళ్లినవారు పల్లూరు అనే రేవునుండి బయలుదేరారు (The Culture of South East Asia - Reginald Le May). ఇక, కళింగమంటే ఒరిస్సాప్రాంతమేనని కొందరు పండితుల భ్రాంతి. తూర్పుతీరమున గంగా గోదావరీ ముఖద్వారముల మధ్య ప్రాంతమంతయు కళింగమని ఒకప్పుడు వ్యవహరింపబడినది. ఇందు ఉత్తర, మధ్య, దక్షిణ లేక త్రికళింగములను విభాగములుండేవి. ఉత్తర కళింగమే ఉత్కళమైనది. త్రికళింగమే త్రిలింగమైనదని కొందరి వాదము. ఏమైనప్పటికీ, ఉత్తరాంధ్రమునకు కళింగమను పేరుండెననుట నిర్వివాదాంశము. పల్లూరు (పాలూరు) గంజాం జిల్లాలోని చిలక సరస్సు దక్షిణ అగ్రమునం

దున్నది. ఇదియే సంస్కృత వాఙ్మయములో (పల్లు + ఊరు) దంతపురమై యుండును. ప్రస్తుతము ఒరిస్సా రాష్ట్రములో చేరియున్నను, ఈ ప్రాంతమంతయూ నిర్వివాదముగ తెలుగు ప్రాంతమే. పల్లూరు నుండి కళింగాంధ్రులు మలయాకు వలస వెళ్లిరనుటకు మరికొన్ని నిదర్శనములున్నవి. మలయాలో శాన్‌కోలక్‌లో దొరికిన కంచు బుద్ధ విగ్రహములకును, గుంటూరు జిల్లాలో బుద్ధాము (బాపట్ల తాలూకా)లో దొరికిన విగ్రహాలకును చాలా పోలికలున్నవి; లిగర్ అనే చోటనున్న హిందూదేవాలయములలో ఉండవల్లి (గుంటూరు జిల్లా) గుహాలయముల పోలికలు కన్పించును; కౌలానెలిన్‌సింగ్, కెడాహాలలో దొరికిన శాసనములు క్రీ.శ. 5వ శతాబ్దమునాటి వేంగి లిపిలో వేయబడెను.

ఇండోచైనా: ఇండోచైనాలో మొట్టమొదటి వలసలు స్థాపించినవారు ఆంధ్రులు. గౌతమీపుత్ర శాతకర్ణి కాలంలో (క్రీ.శ. 1వ శతాబ్ది) కౌండిన్యుడనే ఆంధ్ర బ్రాహ్మణ యువకుడు ఆదేశాన్ని పాలిస్తున్న 'సోమ' అనే నాగరాణిని వివాహమై కౌండిన్యసోమవంశమును స్థాపించినాడు (Ancient India - Dr. K.P. Jayaswal) అతని సంతతివారు చంపా మున్నగు రాజ్యాలను కూడా జయించారు. చంపారాజ్యం పూర్తిగా ఆంధ్రుల వలసయని చెప్పవచ్చును. ఆ రాజ్యానికి ముఖ్యపట్టణం సింహపురం; అందలి రాష్ట్రాల పేర్లు అమరావతి, కౌధార, విజయ, పంద్రంగ, ఇవియన్ని ఆంధ్రదేశంలోని స్థలములపేర్లే. సింహపురం: విశాఖపట్టణం జిల్లాలో క్రీ.శ. 4,5 శతాబ్దాలలో రాజ్యం చేసిన మాఠరుల రాజధాని; ప్రస్తుతం సింగపురం అనే పేరున చికకోలు, నరసన్నపేటల మధ్య నున్నది (Early Dynasties of Andhradesa - B.V.K. Rao). అమరావతి: సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రం; గుంటూరుజిల్లా, కౌథార; సముద్రగుప్తుని అలహాబాదు ప్రశస్తిలో పిష్టపురము (పిఠాపురం)నకు సమీపమున పేర్కొనబడిన కొత్తూరు. విజయ; శ్రీ పర్వత విజయపురి (నాగార్జునకొండ), పంద్రంగ; నెల్లూరు జిల్లాలోని పంద్రంగమే. ఈ ప్రాంతములనుండి వలస వెళ్ళిన ఆంధ్రులు, మాతృదేశంపైగల అభిమానము కొలది తమ కొత్త స్థావరముల కాయా పేరులే పెట్టుకొని యుందురు. ఇండోచైనాలో నేర్పడిన మరొక భారతీయ రాజ్యం కాంభోజ (Combodia). ఈ రాజ్యానికి, తెలుగు దేశంలో విరివిగా ప్రచారమందున్న కాంభోజరాజు కథకుగల సంబంధమేమో పరిశోధింపవలసి యున్నది.

చంపా, కాంభోజ రాజ్యముల నేలిన రాజులపేర్లు, వేంగినేలిన శాలంకాయన, విష్ణుకుండిన రాజులపేర్లను బోలి (చండవర్మ, ఇంద్రవర్మ) ఉండేవి. నేటికిని ఇండోనేషియా ప్రజలపేర్ల చివరనుండే "ఫాన్" అనేమాట "వర్మన్" అనుదాని అపభ్రంశ రూపమై యుండవచ్చును. ఈ రాజులు పల్లవులవలె "ధర్మ మహారాజాధిరాజు" బిరుదును ధరించారు; వేదాది విద్యల నభ్యసించారు. అమరావతీ రాష్ట్రంలో డాంగ్‌డుయాంగ్ చెంత దొరికిన బుద్ధ విగ్రహాలు ఆంధ్రదేశంలోని అమరావతినుండియే ఎగుమతి యైనవని పండితుల అభిప్రాయము. 'వోకన్' అనేచోట దొరికిన శాసన లిపి·వాసిష్ఠీపుత్ర శాతకర్ణి కన్హేరి శాసన లిపికి నకలుగా నున్నది; తరువాతి శాసనాలు వేంగి లిపిలో నున్నై. ఇండోచైనాలో శాలివాహన శకం వాడబడింది. కాంభోజదేశాన్ని పాలించిన ఐదవ జయవర్మ (క్రీ.శ. 968) తనను శ్రీశైలముతో (కర్నూలు జిల్లా) పోల్చుకొన్నాడు. భక్తులకు శ్రీశైలము మోక్షము నిచ్చునట్లు, యాచకులకు జయవర్మ దక్షిణల నిచ్చువాడట! దీనినిబట్టి క్రీ.శ. 10వ శతాబ్దమువరకును, శ్రీశైల శైవక్షేత్రము ఇండోచైనా ప్రజలదృష్టి నాకర్షించుచుండెనని వేరుగా చెప్పనక్కరలేదు. కాంభోజ దేశంలోని
...లు విష్ణువును, అనంతశాయి రూపంలో ఆరాధించేవారు. ఆ దేశంలోని శైవులను

శ్రీశైలంవలె, వైష్ణవులను బహుశః ఉండవల్లి గుహాలయంలోని అనంతశాయి ఆకర్షించి యుండవచ్చును!

**ఇండోనేషియా :** పెగూ, కాంభోజ దేశాలనుండి భారతీయులు ఇండోనేషియాను (జావా, బోర్నియో మొదలైన సుగంధ ద్వీపాలను) ఆక్రమించారని ఫెర్గూసన్ పండితుని సిద్ధాంతము. కళింగాంధ్రు లాక్రమించారనటానికి నిదర్శనంగా, జావాకు కళింగమనే పేరుండేది. ఈ ద్వీపాల నేలిన రాజులుకూడ 'వర్మ' నామాంకితులే. అందు పురాణవర్మ మహారాజు గోసహస్రదాన మొనర్చెనట! ఇటువంటి దానముల ప్రసక్తి తరచు ఆంధ్రదేశము నేలిన చక్రవర్తుల శాసనములలో కన్పించును. విజయపురిలో ఇక్ష్వాకుల రాజవంశ స్థాపకుడైన శ్రీ శాంతమూలుడు గోశతసహస్ర హలశతసహస్ర ప్రదాతయట!

ఇండోనేషియాలో పెక్కుచోట్ల అమరావతీ సాంప్రదాయములలో మలచబడిన బౌద్ధశిల్ప ములు లభించినవి. జావాలో నెల్ల బోరోబుదురు శిల్పము జగత్ప్రసిద్ధి గాంచినది. ఇచ్చట ఒక మహాపర్వతాన్ని అసంఖ్యాకమైన ఉద్దేశిక స్తూపాలుగా శిల్పి చెక్కి వేశాడు. ఆంధ్రదేశంలో బొజ్జన్నకొండ, లింగాలమెట్టలను (విశాఖపట్నం జిల్లా) చూచినవారికి బోరోబుదురు గుర్తుకు వస్తుంది. ఇచట కొండలో మలచబడిన ఉద్దేశిక స్తూపాలనే, తరువాతి కాలంలోని శైవులు లింగాలమెట్ట అన్నారు. కాకతాళీయంగా దీని ద్వారా శైవులవల్ల బౌద్ధానికి జరిగిన అపచారాన్ని కూడా గ్రహించవచ్చు. వీరు లింగాల మెట్టను ఆనుకొని ఉన్న కొండగుహలోని బుద్ధుని బొజ్జన్న (విఘ్నేశ్వరుడు)గా పూజించారు. స్తూపాలు లింగాలైనవి; బుద్ధుడు బొజ్జన్నయైనాడు! దానిప్రక్కనే ఉన్న సంఘారామము నేడు సంకరం ఐపోయింది! (సంకరం అనే గ్రామం ఇప్పుడున్నది) కాని, బౌద్ధ క్షేత్రంగా నుండిన లింగాలమెట్టయే బోరోబుదురుశిల్ప మహాకార్యానికి ఉపక్రమణికయైనదని శిల్ప చరిత్రకారుల అభిప్రాయము. (Buddhist Remains in Andhradesh - K.R Subramaniam).

ఇండోనేషియాలో శివ, కేశవు లిద్దరూ ఆరాధింపబడ్డారు. కాని క్రీ.శ. 12,13వ శతాబ్దాలనా టికి ఈదేవతల కభేదము నూహించి హరిహరస్వామిని ప్రజలు పూజించారు. ఇండోనేషి యాలో హరిహరస్వామి విగ్రహాలు పెక్కు దొరికినై. విశేషమేమంటే, ఇదే కాలంలో ఆంధ్రదేశం లోకూడ హరిహరభావం ప్రబలంగా ఉండేది. కవిబ్రహ్మయైన తిక్కన సోమయాజి ''శ్రీయన గౌరినాబరగు'' అంటూ హరిహరతత్త్వాన్ని ప్రజలకు మహాభారతం ద్వారా ప్రబోధించినది క్రీ.శ. 13వ శతాబ్దిలోనే. ఈ రెండు దేశాలలోని హరిహరతత్త్వాలకుగల సంబంధాన్ని పరిశోధింపవలసి ఉంది.

హిందూమతంతోబాటు మహాభారత రామయ ణేతిహాసములుకూడా సుగంధ ద్వీపా లకు పయనించినై. తెలుగు దేశంలో వలెనే ఇచట తోలుబొమ్మలాటలు (Shadow Plays) ప్రజల వినోదాలు. ఆ ఆటలకు ఇతిహాస కథలే ఇతివృత్తాలుగా ఉండేవి. ఇవి 'కవి' భాషలో వ్రాయబడినై. ఇందు నూటికి 90 పాళ్ళు సంస్కృతం. లిపిమాత్రం వేంగిలిపియే. బోర్ని యోలో దొరికిన 'యూపా' శాసనం వేంగి లిపిలోనే వేయబడిందని ప్రఖ్యాత క్రోంపండితుని నిర్ణయము. ఈ దీవుల్లోగూడా శాలివాహన శకమునే ప్రజలు వాడుకొన్నారు.

**సింహళము :** ఆంధ్ర సింహళ దేశాలమధ్య సంబంధం బహు పురాతనమైనది. బౌద్ధ వాఙ్మ యంలో సింహళాన్ని నాగలోకమనేవారు; కృష్ణానదీ ముఖద్వార ప్రాంతం కూడ నాగదేశమని

వ్యవహరింపబడింది. తూర్పుతీర ప్రాంతాలనుండియే నాగజాతులు సింహళానికి వలసపోయి నారని ఊహించవచ్చును. రామాయణంలో పేర్కొనబడిన లంకయే సింహళమైనచో, రావణుడు దండకారణ్య ప్రాంతాన్ని జనస్థానము (జననస్థానము) అని పిలవటం గమనింపదగి నది! సింహళానికి గొనిపోబడిన బుద్ధునిదంత గాథల్లో కృష్ణా ముఖద్వారంలోని వజ్రాలదివ్వె ప్రస్తావన కన్పిస్తుంది. సింహళ ప్రభువులైన విజయుడు, క్షేమ సింహుడు కర్మరాష్ట్రంనుండి 'కమ్మసాలీల' నాహ్వానించినట్లొక ఐతిహ్యం ఉంది. దుత్తగామిని అనే సింహళ ప్రభువు, ఆంధ్రదేశంనుండి బుద్ధుని ధాతువులు సంపాదించి వానిపై అనూరాధపురంలో స్తూపాలు నిర్మించినట్లును, ఆ స్తూప ఆవిష్కరణ మహోత్సవానికి పల్లవ భొగ్గ (పల్లవభోగ్య లేక పలనాడు) నుండి పదివేలమంది శిష్యులతో మహాదేవభిక్షు సింహళమున కేగినట్లును మహావం శమనే సింహళ గ్రంథము పేర్కొనుచున్నది. భారతదేశంలో నాటికే రూపుమాసిపోయిన ''ప్రజ్ఞాపారమిత'' శాస్త్రమును ఆచార్య నాగార్జునుడు సింహళ దేశము నుండి తెచ్చి వ్యాఖ్యానాలు రచించినాడట! ఆనాటి నుండి నాగార్జునకొండ సింహళ బౌద్ధులకు పుణ్యక్షేత్ర మైనది. సింహళ యాత్రికులకై ప్రత్యేకంగా నాగార్జునకొండలో ''సిహళ విహారము'' (సింహళ విహారము)ను నిర్మించి అందు బోధివృక్షమును నెలకొల్పారు. ఆచార్య నాగార్జునుని తరువాత, ఆచార్య పీఠ మధిష్ఠించిన ఆర్య దేవుని, సింహళ రాజైన ఓహరతిస్స తన దేశానికి ఆహ్వానించి గౌరవించాడు.

కుతూహల మహాకవి రచించిన 'లీలావతి' అనే ప్రాకృత కావ్యంద్వారా లీలావతి అనే సింహళ రాకుమారి, కవివత్సలుడైన హాలుని వరించివచ్చి వివాహమాడినట్లు తెలియుచున్నది.

ఇంతటి సన్నిహిత సంబంధా లుండటంవల్ల ఆంధ్ర సంస్కృతిని సింహళ ప్రజ లాదరిం చారనటంలో విప్రతిపత్తి యుండదు. అనూరాధపురంలోని బౌద్ధదేవాలయాలకు ఉండవల్లి గుహాలయాలు నమూనాలైనవి; సింహళములోని త్రిపిటకములు ఆంధ్రదేశమునుండి దిగుమతి యైన పాళీభాషలో వ్రాయబడినవని ఓల్డెన్ బర్గ్ (Oldenburg) పండితుని తీర్మానము.

**మధ్యఆసియా :** ఆంధ్ర సంస్కృతి ప్రభావము మధ్య ఆసియా వరకునూ ప్రాకుట మరీవిశే షము. నాగార్జున కొండలో లభించిన శాసనముల వలన ఆంధ్రప్రాంతం నుండి బౌద్ధ భిక్షువులు మతప్రచారార్థం కాశ్మీరు, చైనా మొదలైన దేశాలకు గూడ వెళ్ళినట్లు తెలియుచున్నది. చైనా జపాను దేశాలలో వ్యాపించిన జెన్ బౌద్ధం శ్రీపర్వత శిఖరాలనుండి ప్రబోధింపబడిన మహాయానంలో నొకభాగమైన ధ్యానబౌద్ధమే! ఆచార్య నాగార్జునుడు వైద్యశాస్త్ర ప్రవీణుడని, అతడు చైనా టిబెట్ దేశాలకుగూడ వెళ్ళినట్లును విశ్వసింపబడుచున్నది. అతని పరిశోధనా ఫలితములైన నేత్రాంజనము మొదలైన ఔషధములు నేటికి చైనాలో వాడుకలోనున్నవి. నాగార్జునకొండలో ఇటీవల బయల్పడిన పురావస్తు విశేషముల వలన నచట రసాయనిక పరిశోధనలు జరిగినట్లు రుజువగుచున్నది. క్రీ.శ. 7వ శతాబ్దంలో శ్రీపర్వతక్షేత్రమును దర్శించిన యువాన్‌చాంగ్ కూడ ఆ విహారములోని బౌద్ధులు ప్రజలకు ఔషధ సేవ చేయుచున్నట్లు వచించినాడు. చైనాలోని హోవాను రాష్ట్రమందలి నాన్‌హ్సింగ్‌టాంగ్ గుహాలయములలోని బౌద్ధ శిల్పాలకు అమరావతీ శిల్పాలు మాతృకలు. జపానులోని హోరి యూజి దేవాలయంలోని కుడ్య చిత్రాలకు అజంతా చిత్రాలకు దగ్గిరపోలికలున్నవట! టిబెట్ చరిత్రకారుడైన లామా తారానాథుడు (క్రీ.శ. 8వ శతాబ్దివాడు) లాసా విశ్వవిద్యాలయాన్ని అమరావతీ-ధాన్యకటక విశ్వవిద్యాలయం నమూనాగా నిర్మించినట్లు పేర్కొనినాడు.

ఆ విశ్వవిద్యాలయంలో 1700 మంది విద్యార్థులు విద్య నభ్యసించుచుండేవారట!

మధ్య ఆసియాలో కారాసాహర్, కూచి మొదలైనచోట్ల బౌద్ధస్తూప శిథిలాలతోబాటు పెక్కు సంస్కృత గ్రంథముల ప్రతులు దొరికినై. వానిలో కాతంత్ర వ్యాకరణ మొకటి. ఈ వ్యాకరణము ననుసరించియే మధ్య ఆసియా ప్రజలు సంస్కృతము నభ్యసించుచుండిరి. కాతంత్ర వ్యాకరణము శర్వవర్మయను పండితుడు (క్రీ.పూ. 1వ శతాబ్ది) తన యేలికయైన ఆంధ్ర సాతవాహన చక్రవర్తిని ఆరు మాసములలో సంస్కృత విద్వాంసుని చేయుటకై రచించి కృతకృత్యుడైనాడట! ఆ వ్యాకరణానికే ఆసియా ప్రజలు జోహారులర్పించినారు!

ఈ విధంగా ప్రాచీనాంధ్రులు విదేశాలతో నేర్పరచుకొన్న వాణిజ్య, సాంస్కృతిక సంబంధాలు, ఇటీవలకాలం వరకూ నిలిచి యుండినట్లు తెలుస్తుంది. క్రీ.శ. 15వ శతాబ్దంలో విజయనగర రాజ్యము నేలిన ఇమ్మడి దేవరాయలికి బర్మాలోని పెగూ, టెనాసరిం రాజ్యములు కప్పము చెల్లించుచుండినట్లు పారశీక బాటసారియైన అబ్దుల్ రజాక్ పేర్కొనినాడు. దేవరాయలికి సమకాలికుడైన శ్రీనాథ కవిసార్వభౌముడు తన హరవిలాస కావ్యంలో కొండవీటి రాజ్యములో చామిశెట్టి వాణిజ్యమును వర్ణించుచు రచించినాడు.

Dear Editor,

I was glad to see the latest issue of మిసిమి ('MISIMI' for April 1994).

Dr. P.S. Sastri's comment on Prof. Dayakrishna's articles in criticism of certain inadequ in Indian Philosophy was learned and thought-provoking. What Dr. Radhakrishnan said (in **'The Reign of Religion in contemporary philosophy'** and **'Eastern Religions and Western Thought'**) would seem to apply equally aptly and even more to Indian (especially Hindu) philosophy.

An intelligent layman, who is not a specialist, is apt to get the impression that whether it be **tattva** or **Darshana**, any one holds forth on almost the same facile generalisations. relating to 'religion devotion and salvation', which will not be accepted as 'philosophy' by the European school of analytical philosophers.

That apart, let me congratulate you on your refreshingly new approach to the 'chemistry of (Romantic) Love' (the chemistry of human nature itself is very complex). It is sharply analytical, strikingly unconventional, but firmly documented with quotations from acknowledged authorities. In our traditioral society, even poets like Kalidasa seem to be unaware of the elevating nature of romantic love, but sex is always uppermost in their minds. (eg detailed description of Parvati's vital statistics in **'Kumara Sambhava'**, dropped by Srinatha in his adaptation). In recent times, it was Tagore and the Telugu Romantic Poets, who stressed the emotional element, and slurred over or only suggested the physical - sexual aspect.

The inspiration was derived mainly from the English Romantic Poets like Wordsworth, Coleridge, Keats and Shelley, among others. They were introduced in Andhra by an English teacher of repute, R. Venkataratnam Naidu (who taught D.V. Krishna Sastri, among others), who was equally familiar with Persian Sufis like Saadi and Rumi as well.

Incidentally, the one who said: "My love is like a red, red, rose" is the Scottish poet, Robert Burns (1759-96).

With the Best Regards

M.R.K. Sarma BOMBAY

# విశ్వజీవి రోమాఁ రోలాఁ

- డా॥ సంజీవదేవ్

మనిషి ఎందుకు అయినాడు మనిషి? మనిషి మనిషికాక ఏమవుతాడు మరి?

మనిషి మనిషి అయినాడు తాను జంతువు కాలేదు కనుక, పక్షి కాలేదు కనుక.

అయినాడు మనిషి తాను చెట్టు కాలేదు కనుక, మట్టి కాలేదు కనుక మనిషి అయినాడు. మనిషి తాను బండ కాలేదు కనుక, కొండ కాలేదు కనుక.

తాను రవి కానందున, శశి కానందున, తార కానందున, సితార్ కానందున మనిషి అయినాడు మనిషి.

మనిషి ఏ దేశంలో పుడితే ఆ దేశపు మనిషి అనిపించుకొంటాడు. జర్మనీలో పుడితే జర్మన్ మనిషి అని, జపాన్‌లో పుడితే జపాన్ మనిషి అని, భారతదేశంలో పుడితే భారతీయ మనిషి అని, ఫ్రాన్సులో పుడితే ఫ్రెంచ్ మనిషి అని.

కాని కొందరు 'మనీషులు' వుంటారు, ఏ దేశంలో పుట్టినా వారు ఆదేశపు వారు మాత్రమే కాక ప్రతి దేశపువారు అవుతారు.

లోక విఖ్యాత ప్రజ్ఞాప్రాణి రోమాఁ రోలాఁ ఫ్రాన్సులో జన్మించినా కూడ విశ్వప్రాణి అయినాడు, అంతర్జాతీయ ప్రజ్ఞా ప్రవీణుడైనాడు.

ఆయన మాతృ భాష మాత్రమే ఫ్రెంచ్‌గా నిలిచింది, ఆయన మాత్రం ఫ్రెంచ్ మనిషిగా నిలవలేదు. ప్రపంచపు వైశాల్యాన్ని అందుకున్నాడు, మానవుల మానసాల లోతులలోకి దిగాడు, మానవ మేధలోని ఎత్తులలోకి ఎక్కాడు.

రోమాఁ రోలాఁ ఉచ్చకోటికి చెందిన గీతాచార్యుడు, సంగీతాచార్యుడు, ఉన్నత సాహితీ శిల్పి, గంభీర దార్శనికుడు, గంభీర చింతాశీలి, కారుణ్య జీవి, ఆదర్శ మహామానవుడు, ఇంకా ఎన్నో, మరెన్నో.

ఆయన కళాసృష్టి ఏ ఒక్క ఇతివృత్తానికీ పరిమితం కాలేదు, జీవితంలోని 'అణోరణీయాన్ మహతోమహీయాన్' కు చెందిన చిన్న, పెద్ద, ప్రాచీన అర్వాచీన, ప్రాచ్య ప్రతీచ్య అనే ప్రభేదాలు లేకుండా అన్నీకూడ ఆయన కళా సృష్టికి ఇతివృత్తాలే, సాంకేతిక పరిజ్ఞానపు వైవిధ్యం ఆయనకు ఆరాధ్యం.

కొద్ది సంవత్సరాలలో ఫ్రాంకో-ప్రష్యన్ యుద్ధం రాబోతూందనగా 1866లో ఫ్రాన్సులోని బర్గండ్ సమీపపు క్లామెసీ అనే చిన్న బస్తీలో రోమాఁ రోలాఁ జన్మించాడు. ఆయన రవీంద్ర కవీంద్రుని కంటే అయిదేళ్లు చిన్నన్నమాట వయస్సులో.

ఆయన బాల్యం గడచిన ఆప్రాంతం నిసర్గశోభతో రసాత్మకంగా వుండేది. ఆ సుందర వసంత ప్రభాతాలు, గ్రీష్మ మధ్యాహ్నాలు, శరత్ సంధ్యలు ఆ లేత మనసుమీద ఎన్నో విధాలైన

చెరగని సుందర ముద్రలను వేస్తుండేవి. ఫ్రెంచ్ ఆకాశపు నీలవర్ణాలు, ఆకాశంమీదిగా తేలిపోయే నారింజ మేఘాలు, జలాశయాల్లో వాటి కమనీయ ప్రతిబింబాలు ఆయనకు ముఖ్య మిత్రులు.

రోలాం స్వభావం ప్రశాంత స్వభావం, ఏకాంత తన్మయీ స్వభావం. మనుషులకు దూరంగా, ప్రకృతికి దగ్గరగా వుండటంలో ఆయన ఆనందాన్ని పొందేవాడు. మనుషుల మధ్య ఆయన ఏకాంతాన్ని దర్శించేవాడు, మాటల మధ్య ఆయన మౌనాన్ని వినేవాడు.

కనిపించే రూపం కంటే వినిపించే శబ్దం ఆయనకు ఎక్కువ ప్రీతికరం. తనకు సంగీతం సాహిత్యం ప్రధాన ఇష్టాలయినా, ఆయన మొగ్గు ఎక్కువగా సంగీతంమీదనే వుండేది. మేఘాలమీది ఇంద్రధనువు కంటే చెట్టుమీది పిట్టకూత ఆయన కెక్కువ రసానుభూతిని కలిగించేది. తానుకూడ పిట్ట కూసినట్లు కూయ ప్రయత్నించేవాడు. అయితే, పిట్టకూత కంటే తన స్వంత కూతయే తనకెక్కువ మాధురిని కలిగించేది.

సమస్త కళలలోకి సంగీత కళ సూక్ష్మతమమైంది. వాస్తుకళ అన్నిటికంటే స్థూలమైంది; ఒక చోటనుంచి మరో చోటుకు కదిలించటానికి వీలులేని స్థూలతమ కళ.

శిల్పకళ వాస్తు కళకంటే తక్కువ స్థూలం. దాన్ని ఒక తావునుంచి మరో తావుకు కదిలించవచ్చు. భౌతిక పదార్థానికి తోడు అందులో భావప్రకటనకూడ వ్యక్తమవుతుంది. కొంత గతిశీలత, కొంత లయవిన్యాసం కూడ అందులో ప్రత్యక్షమవుతుంది.

పై రెంటితో పోలిస్తే చిత్రకళ సూక్ష్మమైన కళ. వాస్తుకళవలె స్థాణువు కాదు, శిల్పకళవలె జడమయం మాత్రమే కాదు. అదెంతో భావమయం; వర్ణవైచిత్రి ప్రధానం; కంటికి మాత్రమే కనిపిస్తూ చేతికి తగలని రూపాలుంటాయి అందులో. చెట్టున పూయని పూలు చిత్రాలంటే.

ఇక వీటన్నిటికంటే సూక్ష్మతమ కళ సంగీతం. అది నాద ప్రధానమైన కళ. నాదం స్వతంత్ర సత్తా. అది బయటి పదార్థంతో పనిలేకుండా మానవుని లోపలి మాధ్యమం నుంచి తయారయ్యే అతి సూక్ష్మ కళ. అది కలలాంటి కళ. అతి సూక్ష్మ స్పందనగల రోలాం కు సంగీతం ప్రధాన ఆకర్షణ అయింది.

సంగీతంతోపాటు సాహిత్యం కూడ ఎక్కువ ఆకర్షణ గలదిగా వుండటంతో ఆరెండూ కూడ ఆయనకు అభిమాన విషయాలైనాయి. సాహిత్యంలో ఆయన అభిమాన వ్యక్తి షేక్స్పియర్, సంగీతంలో బీథోవెన్. ఒక దానిలోనివి అర్థాలనిచ్చేమాటలు; రెండవదానిలోది అనుభూతినిచ్చే నాదం.

ఈ విధంగా జీవితంలో ఈ రెండు కళలూ పెనవేసుకొని ఆయన మానసపు ప్రమిదలో ఆనంద దీపాలను వెలిగిస్తుండేయి. ఆయన ఒంటరితనపు ప్రమిదలో సాహిత్యం సంగీతం ఆనంద దీపాలై వెలుగుతుండేయి. అందువల్ల ఆయన సమక్షంలో మరో వ్యక్తి ఎవరూ లేకపోయినా కూడ ఆయనకు ఏకాంతపు బాధ వుండేది కాదు. తన కళలే తన మిత్రులు.

అయితే మానవ జీవితంలో మరో పై మెట్టున్నది. కళలు లేకపోయినా కూడ తాను బాధపడాలసిన అవసరం లేదు, కారణం అటువంటప్పుడు స్వయంగా తానే తన మిత్రుడు. తననే తన మిత్రుని చేసుకొని ఆనందించటం సులభమైన పనికాదు. అయినా, అది అసంభవం కాదు.

కాని, రోమాఁ రోలాఁ కు స్వయంగా తానే తన మిత్రుడుగా నిర్మాణమయే ప్రతిభ వున్నది. అయితే ఇది సులభసాధ్యం కాదు, అందుకని అసాధ్యమూ కాదు. సులభసాధ్యాలు కానివన్నీ అసాధ్యాలు కావు. ఇందుకు తగిన సాధన అవసరం. తగిన సాధన వున్నప్పుడు సిద్ధి అందుబాటులోదే అవుతుంది.

ఈ జీవన రహస్యం బాల్యంనుంచీ రోమాఁ రోలాఁ కు బాగా తెలుసు. అందుకే ఆయన రోమాఁ రోలాఁ అయినాడు. ఆయనకే కాదు, ఇంకొందరికి కూడా ప్రాచీ ప్రతీచీలలో, ఈ రహస్యం తెలుసు. ఆ తెలిసినవారే నేడు మహామహులుగా రాణిస్తున్నారు.

తరువాత కొంత కాలానికి బర్గండీ ప్రాంతాలను వదలి వారి కుటుంబం పారిస్ నగరానికి తరలి వచ్చింది. రోలాఁ కు పారిస్‌లోని ప్రసిద్ధ విద్యాలయమైన నార్మల్ స్కూల్ లో విద్యార్థిగా ప్రవేశం దొరకటం తన భావిజీవన వికాసానికి నాంది అయింది.

ఫ్రాన్స్‌లోనే కాక ప్రపంచం అంతటా విఖ్యాతి చెందిన కొందరు మేధావులు, కళాకారులు, రచయితలు మొదలైన వారు ఆ విద్యాలయంలోనివారే. ఆ నార్మల్ స్కూల్ లో ఆరోజుల్లో అధ్యాపకుడుగా పనిచేస్తున్న యువకుడైన హెన్రీ బెర్గ్‌సన్ తరువాతి కాలంలో విఖ్యాత దార్శనికుడుగా ప్రకాశించాడు. ఆ కాలంలో బెర్గ్‌సన్ "Matter and Memory" అనే గ్రంథాన్ని రచించే ప్రయత్నంలో వున్నాడు.

బెర్గ్‌సన్ బోధల ప్రభావం ఆ విద్యాలయంలోని విద్యార్థులందరిమీద ప్రసరించింది; ప్రత్యేకించి రోలాఁ మీద ఆ ప్రభావం ఎక్కువగా పడింది. బెర్గ్‌సన్ గొప్ప ఆదర్శవాది, భావస్వేచ్ఛ, సంప్రదాయ వ్యతిరేకత, జీవితంలోని ప్రతి విషయంమీద ఒక నవ్య దృక్పథం మొదలైన ఆధునికతకు బెర్గ్‌సన్ ఆదర్శవాదం బలాన్నిచ్చింది.

తరువాత చాలా కాలానికి రోమాఁ రోలాఁ అంటాడు "What they do not forgive Bergson is that he has broken our chains" (ఆయన మాసంకెళ్లను పగులగొట్టటం అనేది జరిపినందుకు ఆయన్ను క్షమించం). ఇదొక వ్యంగ్యోక్తి!

బెర్గ్‌సన్ తత్వం ప్రధానంగా స్వతఃస్ఫురణ (intuition)కు, ప్రాణస్పందన (elan vital) కు సంబంధించినది. అప్పటిలో నిరాశలో నిస్పృహలో అధికంగా జీవిస్తున్న ఫ్రెంచ్ యువతకు బెర్గ్‌సెన్, రోమాఁ రోలాఁ చూపుతున్న నవప్రభాతం ఎంతో చైతన్యాన్ని ప్రసాదించింది.

పందొమ్మిదో శతాబ్దపు అంతిమ భాగం ఫ్రెంచ్ యువజనుల జీవితాల్లో ఒక విధమైన మానసిక దౌర్బల్యాన్ని సృష్టించింది. దాని ప్రాబల్యమే నాటి ఫ్రాన్సులోని రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాల్లో కల్లోలాన్ని రేకెత్తించింది. పాతకొత్తల మధ్య అదొక సంధియుగం.

ఇటువంటి అశాంత కాల ప్రవాహంలో రోమాఁ రోలాఁ ప్రశాంతంగా ఈద లేకపోయాడు. భౌతిక జగత్తులోని వ్యతిరేకతలు మానస సంతృప్తిని నిండుగా వుంచటంలో సఫలత చెందలేకపోయినవి. కొంత బయటి సహాయం వుంటేనే కాని తనలోని అసంతృప్తి పల్చబడే ఉపాయం తట్టలేదు. అనుభూతి మాత్రమే తనలోని అజ్ఞాతాందోళనను తీర్చలేకపోతోందని ఆయన గ్రహించాడు.

దాంతో షేక్స్‌పియర్, బీథొవెన్ లాంటి సాహిత్య, సంగీత కళాకారులు తమ ఆకర్షణలను రోలాఁ మానసంలో పొగొట్టుకొన్నారు. ఆపత్ ఘడియల్లో వారికళాసృష్టి ఆయనలో ఆనంద ప్రకంపనలను సృష్టించ లేకపోతున్నట్లు అనుభవం పొందసాగేడు.

అటువంటప్పుడు తన మండే హృదయాన్ని ఎవరు చల్లార్చగలరనే ఆలోచనల్లో ముని గున్నపుడు టాల్‌స్టాయి రచనలు మెదడులో మెరిశాయి. అటువంటి నల్లచీకటిలో తెల్ల వెలుగు రేకలు టాల్‌స్టాయిని గురించిన ఆలోచనలోనే మెరిశాయి. టాల్‌స్టాయి తత్వంలోని భౌతిక స్థూలత్వపు, భావ సూక్ష్మత్వపు ఐక్యతా జ్వాల, ఆకలి బాధలోని ఆత్మ బోధలోని సంగమహేల ఆయన మానస కాసారంలో అలలు లేపాయి.

అంతటితో టాల్‌స్టాయికి వెంటనే ఒక కమనీయమైన, కరుణామయమైన, కాంతిమయ మైన ఉత్తరాన్ని వ్రాశాడు. అందులో తనమానసిక దైన్యాన్ని, జీవితంలోని అస్థైర్యాన్ని ఇంకా తనలోని అభావాన్ని వ్యక్తం చేశాడు. వీటన్నింటినీ తీర్చగల సలహా ఇవ్వటం టాల్‌స్టాయికి మాత్రమే సాధ్యమనీ వ్రాశాడు.

టాల్‌స్టాయి తన రచనల్లో శారీరక శ్రమకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. మానవుడు శారీరక శ్రమ చేస్తున్నప్పుడు తన్నుతాను మరచిపోతాడు. తన ఉనికిని తాను మరచినపుడు బాధ తెలియదు. బాధ తెలియనపుడు సంతోషం తెలుస్తుంది సంతోషం కంటే మించిన సంతోషం జీవితంలో ఏ ముంటుంది కనుక? శాస్త్రాల్ని, కళల్ని ఇతర విద్యల్ని విస్మరించి శ్రమను అంటిపెట్టుకోవటం ఎందుకు అంటూ కూడ వ్రాశాడు తన ఉత్తరంలో రోలాం

ఆ ఉత్తరం అందుకున్న రోజుల్లో టాల్‌స్టాయి "On Life" అనే గ్రంథరచనలో మునిగున్నందువల్ల రోలాం ఉత్తరానికి ప్రత్యుత్తరం ఇవ్వటంలో జాప్యం చేశాడు. దాదాపు ఆరు మాసాల అనంతరం రోలాం తిరిగి మరో దీర్ఘలేఖ వ్రాశాడు టాల్‌స్టాయికి. ఆ ఉత్తరం అందుకొని టాల్‌స్టాయి స్పందించి రోలాం ను స్పందింపచేసే జవాబు వ్రాయటం జరిగింది. ఆ జవాబులో టాల్‌స్టాయి వ్రాసిన మొదటివాక్యం "I have received your letter It has touched me to the heart. I have read it with tears in my eyes." (మీ ఉత్తరం నేను అందుకున్నాను. అది నా హృదయానికి పోయి తాకింది. కన్నీళ్లు నిండిన కళ్లతో దాన్ని నేను చదువుకున్నాను.)

రోమాం రోలాం ఎందరో మహామహుల జీవిత చరిత్రలను రచించాడు. వాటిలో టాల్‌స్టాయి జీవిత చరిత్ర ఒకటి. అందులో టాల్‌స్టాయిలోని వ్యావహారిక జీవికితోడు ఆయనలోని సృజనాత్మక, సమీక్షాత్మక ప్రతిభలను కూడ అద్భుతంగా చిత్రించాడు.

చాలా కాలంగా రోలాంను పీడిస్తున్న సమస్య ఏమంటే కళలో నీతి ప్రధానమా, రసం ప్రధానమా అని రోలాం దృష్టిలో కళకు రసం ప్రధానమని. కాని టాల్‌స్టాయి దృష్టిలో మాత్రం నీతి ప్రధానమని. ఒకరిది రసవాదం, రెండవ వారిది నైతికవాదం. రోలాం సమాజ ప్రయోజనాన్ని కాక రసానుభూతిని ప్రధాన కళాభివ్యక్తిగా భావిస్తే టాల్‌స్టాయి సమాజ ప్రయోజనాన్ని ప్రధానంగా భావించి రోలాం కు తాను వ్రాసిన ఉత్తరాల్లో ఆ విషయాన్ని గురించే ప్రధానంగా నొక్కి చెపుతూ రోలాం దృక్పథాన్ని సమర్థించ లేదు.

చివరకు రోలాం కూడా టాల్‌స్టాయి దృక్పథాన్ని ఆమోదించి దాన్నే అవలంబించాడు. తోటి మానవులు బాధలలో బాధపడుతున్నప్పుడు నిర్మాణాత్మక రూపంలో వాటిని వాటి నుంచి తొలిగించటానికి తోడ్పడే కళ మాత్రమే ఉత్తమకళ అనే సిద్ధాంతాన్ని రోలాం తనదిగా చేసుకున్నాడు. అందుకని కళాసృష్టిని రసహీనం చేయక శ్రేయానికితోడు ప్రేయాన్ని కూడా జోడించాలనే సమన్వయ సిద్ధాంతాన్ని బలపరుచుకొన్నాడు. రోలాం ఒకప్పుడు కళలోని

నైతిక వాదాన్నే సమర్థించినవాడు. కాని తరువాత తరువాత రసవాదంలోకి పరివర్తన చెందాడు తిరిగి టాల్‌స్టాయి సందేశాల ద్వారా నైతిక దృక్పధానికి విలువ ఇవ్వసాగాదు అయితే శ్రేయం అనేది ప్రేయంతో కలిసే సహజీవనం చేయాలని. మానవులందరినీ కలిపేవి మంచితనమూ సౌందర్యమూ అనీ, మానవులను వేరు చేసేవి చెడుతనమూ వికారమూ దాన్ని టాల్‌స్టాయి కాదనలేదు. ఈ మొదటి రెంటినీ శాస్త్రీయ పదాల్లో ''శివం, సుందరం అన్నారు.

టాల్‌స్టాయిని తన ఆరాధ్య వ్యక్తిగా భావించినా కూడ ఆయన్ను గురించి కొన్ని వ్యతిరేక భావాలుకూడా లేకపోలేదు తనలో. తన సమకాలీన యూరప్‌ను నడపగల సత్తా వార్థక్య భారాన్ని మోస్తున్న సంచలన భావంకల టాల్‌స్టాయిలో లేదేమో అనే సందేహం కూడా ఆయనలో చోటు చేసుకొన్నది. తన తరానికి నాయకత్వం వహించటానికి టాల్‌స్టాయి అతివృద్ధుడూ, హెన్రీ బెర్గ్‌సన్ అతి యువకుడూ అని ఆయన భావన.

కాలక్రమేణ రోలాఁ రెండు సంవత్సరాలపాటు ఇటలీలో వుండాలసొచ్చింది. ఆయన ఎక్కడున్నాకూడ ఆయన అభిమానులు వయస్సులో ఆయనకంటే పెద్దవాళ్ళుగా వుండే వాళ్లు. నార్మల్ స్కూల్ వారి స్కాలర్‌షిప్‌తో రోమ్‌లో వుంటున్నప్పుడు వృద్ధురాలైన ఒక జర్మన్ విదుషీమణితో ఆయనకు పరిచయం ఏర్పడింది ఆమె గొప్ప సంస్కృతి సంపన్నురాలు. నవ ఐరోపా మనస్తత్వానికి ఆమె సజీవమూర్తి. ఆమెతో స్నేహం రోమాఁ రోలాఁ లో ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించింది. ఆమెపేరు మాల్‌విడా వోన్ మైసన్ బర్గ్. ఆయన జీవితపు చాలా విభాగాల్లో ఆమె ఒక చైతన్యమూర్తిగా ప్రకాశించింది.

ఆ జర్మన్ విదుషీమణితో చేసే నిత్య సంభాషణలు తన బృహత్ నవల అయిన "Jean Christophe" ని రచించటానికి ముఖ్య ప్రేరణ నిచ్చాయి. ఇదొక గొప్ప కళాకారుని గురించిన నవల. ఇది యూరపు సరిహద్దుల వరకే పరిమితంకాక మానవ నిర్మిత కృత్రిమ క్షితిజాలను అధిగమించి వుంది. విచిత్రం ఏమంటే రోలాఁ ఆ జర్మన్ వనితకెంత అభిమానియో ఆమెకూడ ఆయనకంత అభిమాని.

విశ్వమానవ సౌభ్రాతృత్వమే ఆ ఉభయుల ధ్యేయం; నిస్వార్థతే వారి స్వార్థత. సాహిత్యం ద్వారా, సంగీతం ద్వారా మానవ సేవయే వారి చరమ లక్ష్యం.

ఇటలీ నుంచి ఫ్రాన్సుకు తిరిగివచ్చిన తరువాత ఆయన కొంతకాలం నార్మల్ స్కూల్ లో అధ్యాపకవృత్తి చేసి తరువాత గొప్ప పేరు గడించిన సారబాన్ విశ్వవిద్యాలయంలో సంగీత చరిత్ర ప్రొఫెసర్‌గా ప్రవేశించారు.

అన్వేషణ అనే పదం ఎంత ఇంపుగా వుంటుందో దాని పనికూడ అంత గొప్పగా వుంటుంది. మనిషి జన్మించటం అన్వేషణలో జన్మిస్తాడు, జీవించటం అన్వేషణలో జీవిస్తాడు; చివరకు మరణించటం కూడ అన్వేషణలో మరణిస్తాడు.

దేని నిమిత్తం అన్వేషిస్తాడు? ఉండటంలోని వున్నదాన్ని గురించి, లేకపోవటంలోని లేనిదాన్ని గురించి అన్వేషిస్తాడు. ప్రధానంగా అనేక తావుల్ని గురించి అన్వేషిస్తాడు; స్థూల అస్థిత్వాన్ని గురించి అన్వేషిస్తాడు, అన్వేషిస్తాడు సూక్ష్మ అస్తిత్వాన్ని గురించికూడ; దగ్గరను గురించి దూరాన్ని గురించి కూడా అన్వేషిస్తాడు.

దేన్ని గురించి అన్వేషిస్తాడో అది దొరక్కపోతే నిరాశ చెందుతాడు అన్వేషకుడు, కారణం

అన్వేషణయే గమ్యం కనుక. అన్వేషణయే కర్త, అన్వేషణయే కర్మ. దీన్నే అంటారు నిష్కామ అన్వేషణ అని.

రోమాం రోలాం ఇటువంటి నిష్కామ, నిర్లిప్త అన్వేషకుడు. ఆయనకు జీవించటమే ఒక మహాన్వేషణ. తాను జీవిస్తున్నట్లు గుర్తు ఏమంటే తాను అన్వేషించటమే. తాను అన్వేషిస్తు న్నట్లు గుర్తు తాను జీవించటమే.

ఆయన రచనల్లో, వచనాల్లో ఈ సత్యం ప్రత్యక్షమవుతుంది. అనేకమంది మహా వ్యక్తుల జీవిత చరిత్రలను రచించాడు. వారిలో స్వామి వివేకానంద, గాంధీ, బుద్ధుడు మొదలైన వారెందరో వున్నారు. అదేవిధంగా మైకలేంజిలో, బీథోవెన్, టాల్ స్టాయ్ మొదలైన పాశ్చాత్య మహామహులను గురించికూడ రచించాడు. అదే విధంగా ఎన్నో నాటకాలను రచించాడు; గేయ నాటకాలను, నృత్య నాటకాలను రచించాడు. అదేవిధంగా సంగీత శాస్త్రంలో ఎన్నో నవ్య సంప్రదాయాలను ప్రవేశపెట్టాడు, ఎన్నో నాదరీతులను సృష్టించాడు. భారతీయ సంగీతానికి melody ప్రధానమైతే పాశ్చాత్య సంగీతానికి harmony ప్రధానం.

ఆశించినట్లుగా రోమాం రోలాం కు చాలా కాలంవరకూ రచయితగా కీర్తి రాలేదు. అప్పటివరకు ఆయన 12 నాటకాలు, కొన్ని జీవిత చరిత్రలు రచించాడు. వీటన్నిటికి యూరప్‌లో సరైన గుర్తింపు రాలేదు. రోలాం ఖ్యాతి దేశంలో ప్రాకింది తన బృహత్ నవల ''జీన్ క్రిస్టఫీ''తోనే. దాన్ని పూర్తి చేయటానికి ఆయనకు ఎన్నో సంవత్సరాలు పట్టింది.

''జీన్ క్రిస్టఫీ''లోని ప్రధానపాత్ర ఒక ప్రతిభాశాలి అయిన కళాకారుడు (సంగీత శిల్పి). అతన్ని ఒక ఆదర్శమూర్తిగా రూపొందించాడు. ఒకర్థంలో ఆ గ్రంథం స్వయంగా తన జీవితపు ప్రతిబింబమే అని. తన ఆలోచనలు, అనుభూతులు, తన ఆశలు, నిరాశలు, ఆశయాలు, తన అభిరుచులు, ఆవేశాలు, తన ప్రతిభలు, నిష్ప్రతిభలు అన్నీ ఆ ''జీన్ క్రిస్టఫీ''లో ప్రత్యక్షపరచటం జరిగింది.

''జీన్ క్రిస్టఫీ'' దేశదిమ్మరి; ఐరోపా ఖండమంతా పర్యటించాడు. అది ఆయన్ను సంతృప్తి పరచలేదు. ప్రపంచంలో ఐరోపా మాత్రమే సర్వస్వం కాదు, ఇంకా ఎన్నో దేశాలున్నాయని గ్రహిస్తాడు. తూర్పుగా వున్న భారతదేశం, చైనా, జపాన్ మొదలైన దేశాలు కళల్లోను, శాస్త్రాల్లోను ఎంతగానో ఉన్నతంగా వున్నాయని తెలుసుకుంటాడు.

ఈ గ్రంథం, నవల అయినప్పటికీ అందులో వెల్లడించబడని విషయమంటూ లేదు. అదొక విధంగా విజ్ఞాన సర్వస్వం. తానేమిటో, తనలోది ఏమిటో, తన బయటిది ఏమిటో ''జీన్ క్రిస్టఫీ'' పాత్ర అనే అద్దంలో కొంత స్పష్టంగా, కొంత సగం స్పష్టంగా, మరికొంత అస్పష్టంగా ప్రతిబింబింప చేశాడు.

దీనితో ఆయనకు ఎంతో కీర్తికాంతి వ్యాపించింది అనేక ప్రపంచ భాషల్లోకి అది అనువదించబడింది.

రచయితగా మాత్రమే కాకుండా ఆయనొక మానవతావాదిగా, సమాజ సంస్కారిగా, నవ్యభావధార స్రష్టగా ప్రపంచంలో ప్రకాశించాడు. 1915లో సాహిత్య రంగంలో ఆయనకు నోబెల్ బహుమతి లభించింది.

రోమాం రోలాం జన్మించింది ఫ్రాన్సులో అయినప్పటికీ కొన్ని అనివార్య రాజనైతిక కారణాలవల్ల ఆయన స్విట్జర్‌లాండ్ నివాసి అయినాడు.

రోమాం రోలాం ఒక ప్రోజ్వల సాంస్కృతిక జ్వాల! ★

# కులకాంతలూ - కులటలూ

- డా॥ ఆరుద్ర

ఆదిలో కులాలంటూ ఏవీ ఉండేవి కాదు. అందుచేత కులటల ప్రసక్తి ఉండేదికాదు. కట్టుబాట్లు ఏర్పడ్డాక, కులాలు పుట్టాక కులాచారాన్ని అతిక్రమించటం జరిగితే, అప్పుడూ కులటలు ఏర్పడ్డారు. కులట అన్నపదానికి నానార్థాలు ఉన్నాయి. ఇప్పుడు మనం వ్యభిచారిణి అన్న ఉద్దేశంతో ఈ మాటను వాడుతున్నాం. నిఘంటువులు ఇచ్చే అర్థాల ప్రకారం కులట అంటే కులాలు విడిచిపోవునది అసతి, రంకుటాలు అనే వివరణతోపాటు పతివ్రతయగు భిక్షుకి అనే అర్థం కూడా చెప్పారు. (చూ. సూర్యరాయాంధ్ర నిఘంటువు) పతివ్రత అంటూనే కులట అనడం ఎలా సాధ్యమవుతుంది? ఈ పతివ్రత భిక్షుకిగా బ్రతకటం ఏమిటి? చాలా లోతుకు దిగి పరిశోధిస్తేగాని ఇది తేలదు.

స్త్రీలలో కులట ఉన్నట్లే పురుషులలో కులటుడు అనేరకం మనిషిని మనవాళ్ళు గుర్తించారు. కులటుడు అంటే ఒక కుటుంబం నుండి మరొక కుటుంబానికి వెళ్లేవాడు అని అర్థం. ఇంకొకరకంగా చెప్పాలంటే దత్తపుత్రుడన్నమాట. మగవాడి విషయంలో లేని నీచార్థం ఆడదాని విషయంలో ఎందుకు రావలసివచ్చింది? కులాలు ఏర్పడకముందు స్త్రీ పురుష సంబంధాలు ఎలా ఉండేవి?

కులాలులేని అత్యంత ప్రాచీనకాలంలో స్త్రీ పురుషులు చిన్న గుంపుగా కలసి ఆహారాన్వేషణ చేస్తూ ప్రకృతిసహజమైన కామవాంఛతో జతకట్టేవారు. స్త్రీలు అనావృతలై ఉండేవారు. అంటే ఒక పురుషునికే శాశ్వతంగా కట్టుబడి ఉండేవారు కాదు. ప్రజలు పశువులలాగే తమ తమ మందలలో ఉండేవారు. ఈ పరమ ప్రాచీన సంఘం గురించి పాండురాజు కుంతికి వివరించి వివాహమనే వ్యవస్థ, ఒక స్త్రీ ఒకే ఒక పురుషుని సొత్తుగా ఎవరి ఆదేశంవల్ల సంఘంలో స్థానం ఏర్పరచుకుందో చెప్పాడు.

అనావృతాహి సర్వేషాం వర్ణానామంగనా భువి
యథాగావః స్థితాస్తాత స్వేస్వేవర్ణతథా ప్రజాః
(ఆదిపర్వం, 122వ అధ్యాయం)

ఈ ఘట్టాన్ని నన్నయ్యగారు క్లుప్తంగా తెనిగించారు. "తొల్లి స్త్రీలు పురుషులచేత అనావృతలై స్వతంత్ర భృతిని అఖిలప్రాణి సాధారణమైన ధర్మమున తమ తమ వర్ణంబులందు ఋతుకాలంబు దప్పక నియతానియత పురుషులై ప్రవర్తిల్లుచున్న ఉద్దాలకుడను ఒక్క మహాముని భార్య అతిసాధ్వి, అధిక తపోనిధి అయిన శ్వేతకేతు తల్లి ఋతుమతియైన దానిని ఒక్క వృద్ధవిప్రుడతిథియై వచ్చి పుత్రార్థంబు కామించిన శ్వేతకేతుండలిగి, అది ధర్మవిరుద్ధ మని ఆక్రోశించి, దాని సహింపనోపక –

ఇది యాదిగా సతులెన్నడు బరపురు
షార్థినుల్ గా జన దన్యపురుష
సంగమంబునజేసి సకలపాతకములు
నగు బరి(గహ భూతలైన సతుల
కిట్టిద మర్యాద ఇమ్మనుష్యులకెల్ల
జేసితి లోక (ప్రసిద్ధిగాగ

నని ధర్మ్యమైన మర్యాద మానవులకు
దద్దయు హితముగా ధర్మమూర్తి
అబ్జభవ సమానుడగు శ్వేతకేతుండు
నిలిపె నదియు ధారుణీ జనంబు
నందు లోకపూజ్యమై (ప్రవర్తిలుచు
నుండె శిష్ట సం(ప్రయుక్తి జేసి

మరియు తిర్యగ్యోనులయందును, ఉత్తర కురుదేశంబుయందును, మొదలింటి ధర్మంబ ఇప్పుడు (ప్రవర్తిల్లుచుండు.

(ఆం(ధ మహాభారతం - ఆది - 5-84 నుంచి)

శ్వేతకేతు చెప్పిన ఈ మర్యాద (ఆచారం) వెంటనే అమలులోకి రాదు. ఈ పాతకథను పాండురాజు కథనం చేస్తున్న కాలంలోనే ఉత్తర కురుభూమిలో పాతధర్మమే పాటిస్తూ జనులు తమ తమ గుంపులలో సెక్స్ సంగమాల వల్ల సంతానాభివృద్ధిని పొందేవారు. పెళ్ళి అన్నది పిల్లలను కనటానికి రూపొందించుకున్న ఒక సౌకర్యమే. స్త్రీ పురుషులు పెళ్ళి చేసుకొన్నా ఒక పరిణామదశలో భర్తవల్లనే పిల్లలను కనాలన్న పట్టింపు ఉండేదికాదు. కులం అన్నది ఏర్పడటానికి ముందు మానవ సంఘాలు గుంపులు, ముఠాలు, తండాలు, తెగలు మొదలైన పేర్లతోనే ఉండేవి. వ్యవసాయం జీవనాధారమయ్యాక కులాలు ఏర్పడ్డాయి. కాయకసర్లు ఏరుకొని బతికే స్థితినుంచి పంట పండించుకొని జీవించే దశకు చేరుకొనడానికి మానవులకు చాలాకాలం పట్టింది. మధ్యలో ఎన్నెన్నో అంచెలున్నాయి.

నేటి మన భారతదేశంలో, ఆమాటకొస్తే ఆం(ధ(ప్రదేశ్ లోనే వివిధ (ప్రాంతాల్లోని ఆదివాసుల జీవన విధానాలను పరిశీలిస్తే వాళ్ల ఆచార వ్యవహారాలలో నైతిక విలువల స్థానం తెలుస్తుంది. ఈ ఆదివాసులు ఏయే పరిణామ దశలలో పయనించి నేటి స్థాయికి చేరుకున్నారో ఆ దశలోనే వైదిక సమాజపు ఆర్యులు కూడా పరిణామం చెందారు. మన (ప్రాచీనకాలపు ఆచార వ్యవహారాలను వేద వాఙ్మయం పరిశీలించి, సామాజిక శా(స్త్ర సహాయంతో విశ్లేషణ చేసుకొంటే కులాలు, కులకాంతలు, కులటలు అనే పదాల అంతర్యాలను అవగాహన చేసుకోవచ్చు.

వేద వాఙ్మయంలో 'కుల' 'కులపా' అనే పదాలు కనబడతాయి. వీటిలో మొదటిది వ్యస్తపదంగా ఎన్నడూ ఆదిలో (ప్రయోగించినట్లు దాఖలాలు లేవు. పదబంధంగానే దర్శనం ఇస్తుంది. (బ్రాహ్మణాల కాలంలోనే 'కుల' అనే వ్యస్త పద(ప్రయోగం మొదలైంది. కులమంటే ఇల్లు, కుటుంబం, నివాసగృహం అనే అర్థాలున్నాయి. కాల(క్రమేణా కులమన్న మాటకు చాలా రకాల అర్థాలఛాయలు ఏర్పాటయ్యాయి. వంశము, అన్వయము, సజాతీయ (ప్రాణి సమూహము, తెగ, గృహము, ఇల్లు, జనపదము అనే నానార్థాలు వచ్చాయి. ఇంతేకాక కులమంటే కొలను అనే వివరణ లేకపోలేదు.

ఋగ్వేదంలో ఇంటిపెద్దను 'కులపా' అని పిలిచేవారు. ఇంటిపెద్ద ఇల్లును కాపాడాలి. అథర్వవేదం (1-14-3)లో ఒక కన్యను 'కులపా' అనే పేర్కొనటం జరిగింది. భర్తన్నవాడు లేక కేవలం యముడొక్కడే వలపుకాడుగా జంటగా గల స్త్రీని 'కులపా' అని వ్యవహరించారు. కట్టుకునే భర్త దొరక్క పుట్టింటిలోనే ఉంటూ వయసు మీదపడుతున్న వనితను ఋగ్వేదంలో 'అమాజూర్' అనే సార్థకనామంతో సూచించేవారు. ఈ ఋక్ చూడండి.

అమా జూరివ పితోః సచాసతీ సమానాదా సదసస్త్వామియే భగమ్
కృథి ప్రకేతముప మాస్యా భరదద్ధి భాగం తన్వో యేన మామహః
(ఋగ్వేదం 2-17-7)

ఈ మంత్రంలోని సతి అనే పదానికి సాయణాచార్యులు దుహిత అని అర్థం చెప్పారు. ''కన్నవారి ఇంట్లో ఏళ్లు పై బడుతున్న ఆడ కూతుర్లా నేను ధనం నిమిత్తం నీ దగ్గరకు వచ్చాను. నాకు రావలసిన భాగాన్ని నా పోషణ కోసం తెలిపి కొలిచి తెచ్చి నాకు ప్రసాదించు'' అని ఋషి ఇంద్రుణ్ణి అర్థిస్తున్నాడు.

దీన్ని నేమాని వెంకట నరసింహశాస్త్రి గారు ఇలా అనువదించారు.

పుట్టినది మొదలు పితరుల
నట్టింటనెయున్న దుహిత నయముగ దానా
పుట్టింట వంతు గోరిన
యట్టుల హరి నిన్ను ధనము యాచింప మొకో.
ఇంత ధనమిచ్చెదనటంచు నిపుడె సకల
జనుల ముందర ప్రకటించి శక్ర నీవు
దాని సంపాదనమునకై తత్ క్షణంబు
పోయి గొని తెచ్చి మాకిమ్ము పూర్ణమతిని. (ప్రథమ సంపుటం పుట : 727).

ఈ అనువాదం కింద నేమాని వారు ఒక అధోజ్ఞాపికను కూడా రాశారు. ''అవివాహితలగు కన్యకలు తమ పుట్టింట నుండునట్టి ఆచార మార్యులనాడు కలదనుటకు ప్రమాణికముగా ఈ ఋక్కు చాలును. అట్టి కన్యకలను గాని వారి తల్లితండ్రులను గాని బహిష్కరించెడు నాచారమానాడు లేదు. అదీ స్మృతులనాడు ఋషులు కల్పించి ఉందురు. ఈ విషయమై స్మృతి కారకుల మతము కంటే వేదమతమే లోకహితమైనది.''

పెళ్ళి చేసుకోకుండా పుట్టింటనే అంటిపెట్టుకొని అక్కడే వయస్సు మళ్లుతున్న స్త్రీలు వేదకాలంలో ఉన్నారన్న సత్యనిరూపణకు పై ఒక్క ఋక్కే చాలునని నేమానివారు అన్నారు. గాని వేద వాఙ్మయంలోనే ఇలాంటి మంత్రాలెన్నో చూడవలసిన అవసరం ఉంది. ఒక్కొక్క ఋక్కు వల్ల ఒక్కొక్క నూతనాంశం లభిస్తుంది. ఉదాహరణకు ఋగ్వేదంలోనే ''ఘోషాయై చిత్ పితృషదే దురోణేపతిం జూర్యన్త్యా అశ్వినావదత్తం'' అనే పూర్వగాథ ఒకటి ఉంది (1-117-7).

ఈ పాదానికి ప్రతిపదార్థం ఇలా ఉంటుంది.

| | | |
|---|---|---|
| అశ్వినౌ | = | అశ్వినులారా |
| దురోణే | = | పితృగృహమందు, |
| పితృషదే | = | పితృ సమీపమందు, |
| జూర్యంత్యై | = | ముదిమినిపొందిన, |
| ఘోషాయైచిత్ | = | ఘోషాయను చిన్నదానికి, |
| పతిం | = | పెనిమిటిని |
| అదత్తం | = | ఇచ్చిరి. |

ఈ ఋక్కు వల్ల పుట్టింటనే స్థిరపడిపోయిన నడివయస్సు వారికి కూడా భర్తలు లభిస్తారు.

వేదకాలంలో ఆడ పిల్లలను పుట్టింటనే కట్టిపడవేయమని దేవతలను ప్రార్థించేవారు. అధర్వవేదం (1-14-2)లో దాని తర్వాతి ఋక్కులో రాజైన సోముణ్ణి చిన్నదాన్ని వశపరచుకొని యముణ్ణి ఏమని ప్రార్థించారంటే ''ఈ మీ వధువుతో సంగమించండి! ఆమె తల్లి, భ్రాత, తండ్రుల ఇంటికి ఆమె కట్టుబడి ఉండేటట్టు చూడండి! ఓ రాజా! సోమా! ఈమె మీ కులానికి పెద్ద. శిరస్సువంటిది. ఆమెను తన తండ్రుల చెంతనే ఉండనివ్వండి. అందుచేత వారి శిరస్సులు ఎత్తిన తావులు కాగలవు.'' ఈ అధర్వవేద మంత్రాలు పుట్టింట నుండే చిన్నదాని స్థానాన్ని, హోదాని, సాంఘిక ప్రయోజనాన్ని తెలియజేస్తున్నాయి. ఋగ్వేద ఋషులది ఎంత పితృస్వామ్యమైన వ్యవస్థ అయినా వ్యావసాయిక దశకు వచ్చేసరికి అనార్యుల మాతృస్వామ్య విధానాలను అనుసరించక తప్పలేదు. తలలు పండటం అంటే పంటలు పండటమే.

ఋగ్వేదంలో 'అపాల' అనే చిన్నది ఉండేది. ఆమె ఆయిత్రేయ. ఒక సూక్తానికి కారకురాలు. ఆమె ఒక ఋక్కులో ఇలా ప్రార్థించింది. (8-91)

*ఇమాని త్రీణి విష్టపా తానీంద్ర విరోహాయ*
*శిరస్త తస్యోర్వరామాదిదం మ ఉపోదరే (5)*
*అసౌ చ యాన ఉర్వరాదిమాం తన్వం మమ*
*అథో తతస్యయచ్ఛిరః సర్వాతా రోమశాకృథి (6)*

''ఓ ఇంద్రా! ఈ మూడు తావులూ మరలా పండేటట్టు చూడు! అవి మా తండ్రి శిరస్సు, అతని క్షేత్రం, నా మర్మతలం. మా పొలానికి నా తనువుకూ మా తండ్రి తలకూ రోమసమృద్ధి కలగజేయుము.''

ఇక్కడ రోమాలు సస్యానికి సంకేతాలు. అపాల ఒక కులపా. పుట్టింటి పొలాలకు ఆమె పెద్ద. వాటిని పండింపచేయటం ఆమె బాధ్యత.

వేదకాలంలో రెండు విధాలైన స్త్రీలు ఉండేవారు. ఒకరు బ్రహ్మవాదినులు. రెండోవారు సద్యోవధువులు. బ్రహ్మవాదినులనే కులపాలు అనేవారు. వీరు ఉపనయనం చేసుకొని, వేదాధ్యయనం చేసి అగ్నిహోత్రాలను సంరక్షిస్తూ స్వగృహంలో భిక్షమెత్తుకొనేవారు. సద్యోవధువులు పెళ్లిచేసుకొని కాపురాలు చేసేవారు. (పి.వి. కాణేగారి 'హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్రాస్', 2వ సంపుటం, పుట 293-95).

అన్నదమ్ములు లేని చిన్నది పుట్టింటనే ఉంటూ తండ్రి పొలాలు చూసుకొనేదనీ, తనకి రావలసిన భాగాన్ని సభకు వెళ్లి రాబట్టుకొనేదనీ ఋగ్వేదంలోని మంత్రాల వల్లనే తెలుసుకోవచ్చు.

*''అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానాం*
*జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః''*

(ఋ - 1-124-7)

అన్నదమ్ములు లేని చిన్నది మగవారికొరకు తిరిగి వెళ్తున్నట్లు, ధనలాభం కొరకు సభావేదికను అధిరోహిస్తున్నట్టు, పతిని ఆపేక్షిస్తూ మంచి వలువలు ధరించిన స్త్రీ మాదిరిగా

ఈ ఉషో దేవత తన దంతరుచి తోచగా నవ్వుతూ ప్రకాశించుతున్నది.'' ఇదీ ఈ ఋక్కుకు రమారమీ ప్రతిపదార్థయుతమైన తాత్పర్యం. దీనిని వేదకాలం నాటి సామాజిక పరిస్థితులకు అన్వయించుకొంటూ అవగాహన చేసుకోవాలి. అన్నదమ్ములు లేని చిన్నది ఋగ్వేదకాలం లోనే కాదు, ధర్మసూత్రాల కాలంలో కూడా సర్వసాధారణమైన దుహిత అనిపించుకోలేదు. అటువంటి కుమార్తెను 'పుత్రిక' అంటారు.

మనువు తన ధర్మశాస్త్రంలో పుత్రసంతానం ముఖ్యమన్నాడు. కొడుకులు లేకుండా ఆ వంశం నశించిపోతుందన్న భయంకర పరిస్థితిలో ఒక స్త్రీ తన భర్త అనుమతితో తన మరదివల్ల బిడ్డను కనవచ్చు. మరది కాకపోతే మగడికి ఏడుతరాల లోపున బంధువైన దాయాది వల్లనైనా కనవచ్చు (9-59). భర్తగల స్త్రీలే కాదు, వితంతువులు కూడా బిడ్డలను కనవచ్చు (9-60). కుమారులు లేక ఒకే ఒక్క కుమార్తెగల తండ్రి ఆ పిల్లకు పెళ్ళి చేస్తున్నప్పుడు కాబోయే అల్లునితో ఒప్పందం చేసుకోవాలి.

> ''అపుత్రో నేన విధినా సుతాం కుర్వీత పుత్రికాం
> యదవత్యం భవేదస్యాం తన్మయస్సాత్యధారకం''

(మను - 9-127)

ఒకనికి పుత్రిక లేక కుమార్తె మాత్రమే ఉన్నప్పుడు ఆ కన్యను వరునికిచ్చేటప్పుడు ''ఈ పిల్లకు తోడబుట్టిన వాడు లేనందున దీనికి పుట్టే పుత్రుడు నా వంశానికి శ్రాద్ధం పెట్టేవాడిగా ఉండాలి'' అని అల్లుడితో ఏర్పాటు చేసుకోవాలి. ఇటువంటి కూతురుకు పుత్రిక అని పేరు దక్షప్రజాపతికి అందరూ కూతుళ్లే గాని కొడుకులు లేరు. అందుచేత వాళ్లందర్నీ పుత్రికలను చేసుకొని పెళ్లి చేశాడని తరువాత శ్లోకంలో చెప్పాడు (9-128).

గౌతమ ధర్మ సూత్రాలూ వాటికి హరదత్త మితాక్షరీ ఈ విషయాన్నే ఇంకా స్పష్టం చేశాయి.

అపుత్రుడు (అనగా మగ బిడ్డలు లేనివాడు) దాయమును ఏమి చేయదగునని శంక రాగా చెప్పుచున్నాడు. తండ్రి అనపత్యుడుగా అనగా మగబిడ్డలు లేనివాడైయున్నచో అప్పుడతడు తనకు ఆడు సంతానము ఉన్నయెడల (అది కూడా నొక్కటే కూతురై యున్నచో) అగ్నయేస్వాహా, ప్రజాపతయే స్వాహా అను నిత్యాదులతో నాజ్యాహుతులతో నగ్నియందు వ్రేల్చి ఆ పిమ్మట వరుని యుద్దేశించి నేను సంతానము లేనివాడను కాబట్టి ఈ కన్యకయందు నీకు కలుగగల సంతానము నా నిమిత్తమగుగాక'' అని ప్రతిన చేయించి వర సంగమమునకై కన్యకను వదలిపెట్టవలయునని సూత్రార్థము. ఇచ్చట ప్రతిన చేయించు విధము వాసిష్ఠస్మృతి యందిట్టుల చెప్పబడినది. ''ఓయీ! ఎట్టి సోదరులును లేనిదయినను, యథాశక్తిగా సమలంకృతయును నగు నీ కన్యకను నీకు భార్యగా జేసుకొనుటకై ఇచ్చుచున్నాడను కాబట్టి (అనగా ఈ బిడ్డకు సోదరులు లేరని చెప్పుటచేత నేను అపుత్రుడనని చెప్పినట్లయినది గనుక) ఈ నీకిచ్చెడి కన్యక యందు నీకు బుట్టిన పుత్రుడే నాకు పుత్రుడుగా నుండుగాక'' అని మంత్రమును జెప్పుచు కన్యాదానము చేయదగును.[1]

ఈ విధంగా పెళ్ళిచేసిన తర్వాత ఆ పుత్రిక గోత్రం మారదు. తండ్రి గోత్రమే కొనసాగుతుంది. ఈ స్త్రీకి భర్తతో సంబంధమెంతవరకంటే ''కేవలం సహచారిణీ రతిఫ

లాచ'' అని హరదత్తుడు అన్నాడు. అంటే సహచారిణిగా రతి ననుభవించడానికి మాత్రమే. ''ఇట్లుగాక ఆమె పుత్రార్థియైనచో స్వకుల సంతానము కొరకై వివాహాంతరమును ఒనర్చుకొన వలయునని తాత్పర్యము'' అని ఆంధ్ర వివరణ పంచాగ్నుల వారు ఇచ్చారు.

ఋగ్వేదం 1-124-7 ఋక్కులో ఉషో దేవతను 'అభ్రాతగా' వర్ణించడంలో ఎంతో సాంఘిక చరిత్ర ఇమిడి ఉంది. ఆనాటినుంచి ఈ ఇరవయ్యో శతాబ్దందాకా మగబిడ్డలు లేకపోతే పాటించే ఆచారం ఒకేరీతిలో కొనసాగుతోంది. ద్విజులలో ఎందరో దౌహిత్రులు తమ తమ మాతామహుల దత్తపుత్రులయ్యారు. ఇంకా అవుతున్నారు. దక్షిణభారతంలోని ఇతర వర్ణాలలో కూడా ఈ ఆచారం కనబడుతోంది.

బళ్ళారి, ధార్వార్, మైసూరు, కర్నూలు ప్రాంతాలలోని బోయలు, బేడర్లు మొదలైన కులాలలో ఆడపిల్లను బసివి, లేక బసవిగా దేవునికి అంకితం చేసి పడుపు వృత్తికి విడిచిపెట్టే ఆచారం నేటికీ మిగిలింది. మగసంతానం లేని కుటుంబంలోని ఆడపిల్లనే బసివిని చేస్తారు. బసివి పెళ్లి చేసికోదు. తండ్రి ఇంట్లోనే ఉండిపోతుంది. తండ్రి ఆస్తికి వారసురాలవుతుంది. అతడు మరణిస్తే కుమారుడు చేయవలసిన అంత్యక్రియలు తానే నిర్వహిస్తుంది. పడుపు వృత్తిలో కూడా తమకన్నా తక్కువ కులాల వారితో వ్యభిచరించదు. సర్వసాధారణంగా ఉంచుకున్న వానితో నియమబద్ధంగా కాపురం చేస్తుంది. అయితే ఏడాదికొకసారి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని అతనితో తెగతెంపులు చేసుకోవచ్చు. బసివికి మగ సంతానం కలిగితే ఆ బిడ్డ మాతామహునికి వారసుడవుతాడు. బసివికి ఆడసంతానం పుడితే ఆ కూతుళ్ళు కూడా బసివిరాండ్రవుతారు.[2] బసివి గుడిసాని కాదు. తండ్రి వంశం నశించకుండా ఆ గోత్రాన్ని నిలపడానికి పెళ్ళి చేసుకోకుండా కాపురం చేసే వ్యక్తి.

బిడ్డల్ని కని వంశాన్ని నిలబెట్టుకొనడమే సనాతన ధర్మం. అందుకు అనుసరించే మార్గాలు చాలా ఉన్నాయి. పుత్రసంతానం కలిగిన పద్ధతిని బట్టి వాళ్ళకు 12 రకాల పేర్లు వచ్చాయి.

1. ఔరసుడు - భార్య యందు, తనకు పుట్టిన కొడుకు.
2. క్షేత్రజుడు - భార్య యందు నియోగాన పుట్టిన కొడుకు.
3. దత్తుడు - శాస్త్రీయంగా పెంచుకొన్న కొడుకు.
4. కృత్రిముడు - అభిమానించి పెంచుకున్న కొడుకు.
5. గూఢోత్పన్నుడు - భర్తకు తెలియకుండా రంకు మగనికి పుట్టిన వాడు.
6. అపవిద్ధుడు - పెంచుకున్న అనాథ బాలుడు.
7. కానీనుడు - పెళ్ళి కాకముందు భార్యకు గుట్టుగా పుట్టిన వాడు.
8. సహోఢుడు - గర్భం వచ్చాక పెళ్ళి చేసుకొంటే పుట్టిన వాడు.
9. క్రీతుడు - వెల ఇచ్చి కొనుక్కొన్న కొడుకు.
10. పౌనర్భవుడు - మారు మనువు భార్యకు పుట్టిన వాడు.
11. స్వయందత్తుడు - తనంతట తాను కొడుకుగా వచ్చిన వాడు.
12. జ్ఞాతిరేయుడు - జ్ఞాతి కొడుకు.

ఈ పన్నెండు మందిలో మొదటి ఆరుగురే జ్ఞాతులవుతారు. అనగా ఆస్తి హక్కుగల వాళ్ళవుతారు. మిగతా ఆరుగురు కేవలం బంధువులు మాత్రమే (మను 9-159,160).

వీళ్ళంతా స్వకుల సంజాతులే కాబట్టి బంధువులవుతారు. ఆదిమ కాలంలో జనులు గుంపులు గుంపులుగా, సజాతీయులుగా పరిమిత సంఖ్యలో ఒక చిన్న భూభాగాన్ని కనిపెట్టుకొని కాపురం చేస్తున్నపుడు ఇతర గుంపులతో ఏ రకమైన సంబధం లేనప్పుడు అందరిదీ ఒకే కులం. ఇళ్ళూ ఇంటి పేర్లూ వేరుగా ఉండేవి. ఒకే ఇంటి పేరున్న వాళ్ళ మధ్య స్త్రీ పురుష సెక్సు సంబంధాలు క్రమేణా నిషిద్ధాలయ్యాయి.

ఒకే కులంలో విభిన్నమైన ఇంటిపేర్లు ఎలా వస్తాయో తెలుసుకోవాలంటే ఒక సమకాలిక దృష్టాంతం తీసుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లో కోండులనే ఆదిమ వాసులు జీవిస్తున్నారు. వీళ్ళకు సామంత, జాతపు, కోడు, కొండుకోడు, కోందు, కులింగ అనే పర్యాయ నామాలు కూడా ఉన్నాయి. వీళ్ళు కొండల మీద, కొండ చరియలలోనూ స్థావరాలు ఏర్పరచుకొంటారు. వీళ్ళు ఇళ్ళు కట్టుకొనే పద్ధతి ఒక వరుస క్రమంలో ఉంటుంది. మామూలుగా ఒక్కో స్థావరంలో మూడు ఇళ్ళుంటాయి. వాటిలో రెండిళ్ళు ఒక దానికొకటి ఎదురుగా ఉంటాయి. మూడవది మూడో వైపున మిగిలిన రెండిళ్ళ చివరల కెదురుగా ఉంటుంది. ఒక్కొక్క ఇంట్లో అయిదు లేక ఆరు గదులుంటాయి. ఆ గదులు మట్టితో పూసిన తడకలతోగాని, మట్టి గోడలతో కాని వేరు చేయబడతాయి. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క కుటుంబం నివసిస్తుంది.[3]

ఈ మూడిళ్ళూ ఒకే కులానికి సంబంధించినవే. ఇందులో వర్గాలున్నాయి. వివాహ సంబంధాలు గల వర్గాన్ని 'సండిగ' వర్గమంటారు.

అటువంటి సంబంధాలు లేని వాటిని 'టయింగా' లేక సోదర వర్గం అంటారు. పెళ్ళి కులంలోనే జరిగి తీరాలి. ఒక ఊరు ఊరంతా సోదర వర్గానికి చెందినదయితే వివాహ సంబంధం ఇంకో ఊరి వారితో ఏర్పడాలి.

మన తెలుగు నుడికారంలో ''మీ పిల్లను ఎవరికిచ్చారు?'' అని అడిగితే ''ఫలానా ఇంటికి ఇచ్చాం'' అని చెప్తారు. కాక ''ఫలానా ఊరికిచ్చాం'' అంటారు. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో గుంపు పెళ్ళిళ్ళు ఉండేవి. టిబెట్టు కుటుంబంలో చిన్నది మనువాడక ఎవరో ఒక్కనికే ఆలు కాకుండా ఆ చిన్నవాని ఇంట్లోని అందరికీ పెండ్లామవుతుంది. అయితే దీనికి కొన్ని షరతులున్నాయి. ఇంట్లోని పెద్ద కొడుకు మరో ఇంటి పెద్ద కూతురును పెళ్లాడితే ఆమె చెల్లెళ్లందరూ అతని పెళ్లాలవుతారు. ఒకవేళ ఆ అక్క చెల్లెళ్లలో రెండవదానినే చేసుకొంటే ఆమె చెల్లెళ్లు మాత్రమే బావగారి భార్యలవుతారు. ఈ క్రమంలోనే పరిగణన చేస్తారు. పెళ్లి కొడుకుకు సోదరులుంటే వాళ్లందరూ ఆ వధువుతోనూ, ఆమె చెల్లెళ్లతోనూ కాపురం చేస్తారు. టిబెట్టులో పెళ్లి కేవలం బహు భర్తృత్వ వివాహం కింద కాక గుంపు పెళ్లిగా గుర్తించాలి. ఒక కుటుంబంలోని మగవాళ్లందరూ వివాహ సంబంధం ఉండి పెళ్లాడిన ఇంకో కుటుంబంలోని స్త్రీలందరికీ భర్తలే అవుతారు. వీళ్లందరూ కుల కాంతలే.

కేవలం భర్త సోదరులకే కాక అతని తండ్రికీ, పెద, చిన తండ్రులకూ కూడా ఆమెతో కాపురం చేసే హక్కుంది. ఈ గుంపు పెళ్లిళ్ల ప్రసక్తి ఋగ్వేదంలో కనబడుతుంది. మరుద్గణా లందరికీ రోదసి ఒక్కర్తే భార్య . అగస్త్యుడు మరుద్దేవతలను ఇలా స్తుతించాడు.

''పరాశుభ్రా అయాసో యవ్యా సాధారణ్యేవ మరుతో మిమిక్షుః
న రోదసీ అపనుదంత ఘోరా జుషంత వృధం సఖ్యాయ దేవాః'' (1-167-4).

''స్వచ్ఛమైన అలంకారములు గలవారూ ఎల్లెడలా సంచరించే వారూ అయిన మరున్నామక దేవతలు సాధారణి అయిన భోగినితో చేరిన పురుషుల వలె మెరుపుతో చేరి వానలు కురిపిస్తున్నారు. అధిక వృష్టిని కురిపించి భయపెట్టే వీరు రోదసిని నిరాదరణ చేయక అభివృద్ధి పరుస్తున్నారు.''

''జోషద్యదీమసుర్యా సచధ్యై - విషితస్తుకా రోదసీ నృమణాః
ఆ సూర్యేవ విధతో రథం గాత్ త్వేష ప్రతీకా నభసో నేత్యా'' (1-167-5).

''మరుద్దేవతలను కూడినదీ విడిన కేశములు కలిగి మనుషులందు ప్రీతిగల మనసు కలిగినదీ అయిన రోదసి ఈ మరుత్సంఘమును సంగమం కొరకు సేవిస్తున్నది. సూర్యుని రథాన్ని ఎక్కి అంతరిక్షాన సంచరిస్తున్నది.''

ఈ సూక్తానికి ద్రష్ట అయిన అగస్త్యుడు మరుత్తుల లాగే మాతృ గణవర్గానికి చెందినవాడు. అతని తల్లి ఊర్వశి. పలువురి చెలియ, ప్రేయసి. మన వేద వాఙ్మయంలో మరుద్గణాలలాగే ఇతర గణాలు కూడా ఉన్నాయి. ఒక్కొక్క గణానికి ఒక ఉమ్మడి చెలువ ఉంటుంది. ఆమెను 'జని' అంటారు.

1. వసు గుణాలు - సంఖ్యలో 8. జని - గంగ
2. రుద్రగణాలు - సంఖ్యలో 11. జని - త్రియంబ
3. ఆదిత్య గణాల - సంఖ్యలో 12. జని - అదితి
4. విశ్వే దేవగణాలు - సంఖ్యలో 13. జని - విశ్వ.
5. మరుద్గణాలు - సంఖ్యలో 63. జని - విశ్వ.

ఈ అయిదు సోదర వర్గాల్లో 107 ఇళ్లున్నాయి. వీరందరూ అనార్యులకు చెందిన ఒక జాతి. దేవి నిర్ఋతికీ సోమునికీ ఈ జాతి జన్మించినట్లు ఆదిమ భావన. నిర్ఋతి నేల తల్లి, సోముడు నింగి తండ్రి. ఈ ఇద్దరికీ ప్రతి అమావాస్యనాడు పెళ్లి జరుగుతున్నట్లు సనాతనుల విశ్వాసం. ప్రతి మాసంలో జరిగే ఈ పెళ్లిని 'దేవ వివాహం' అని ఐతరేయ బ్రాహ్మణం (IV-27) పేర్కొంది. ప్రతి మాసం పాత సోముడు (చంద్రుడు) మరణించి, కొత్త సోముడు ఉద్భవించి నిర్ఋతితో సంగమిస్తాడు. ఇది వ్యావసాయక సమాజ వ్యవస్థలో మూల సూత్రం.

కులం అన్న పదం కేవలం వ్యవసాయ దశలోనే వాడుకలోకి వచ్చింది. కులం అంటే గ్రామం అనే అర్థమే అయినా ఆ గ్రామంలోని పంటకు కూడా అదే మాట వాడతారు. మనువు గ్రామాధిపతుల జీతాల గురించి ఇలా చెప్పాడు.

దశీకులంతు భుంజీవి వింశీపంచకులానిచ
గ్రామం గ్రామ శతాధ్యక్షః సహస్రాధిపతిః పురమ్ (మను - 7-117)

వ్యాఖ్యాతలు దీనికి ఇలా అర్థం చెబుతున్నారు. ''పది గ్రామముల కధిపతి మడక యొక్కంటికి దినమునకు ఆరెద్దులు విడిచి కట్టుకట్టెడు రెండు మడకల చేత దున్నబడు భూమియందు పండు ధాన్యమును, ఇరువది గ్రామముల కధిపతి వానికి అయిదు పాళ్లు

ధాన్యమును, నూరు గ్రామముల కధిపతి మధ్యతరమ్మైన ఒక గ్రామమును, వేయి గ్రామముల కధిపతి మధ్యతరమ్మైన యొక పట్టణమును తన జీవనం నిమిత్తము అనుభవించుకొనవల యును'' ఈ వ్యాఖ్యానంవల్ల కులము రెండు మడకలచేత దున్నబడే భూమి అని నిర్ధారణ అవుతోంది.

కుల భూమిని సేద్యం చేయటానికి నీటి వనరులు అవసరం. పంట కాలువలను కుల్యలంటారు. కుల భూమి కొలతకు ఒక పరిమాణాన్ని నిర్ణయించినట్టే కుల్యకు కూడా ఒక కొలతను పూర్వులు నిర్దేశించారు. ఎనిమిది ద్రోణముల ధాన్యము పట్టే గంపను కుల్య అంటారు. నాలుగు కుంచాల ధాన్యమని కొందరంటారు. ఒక కుల్యలోని విత్తనాలు ఒక కులంలోని పంటకు సరిపోతాయని చెప్తారు. ఒక కులం పొలం 128 నుంచి 160 బీగాల పరిమాణముంటుంది.

ఆదిమ వ్యవసాయ కర్మలన్నీ స్త్రీలే చేసేవారు. సేద్యం అసలు ఆడవారి సొత్తు. వేద కాలంలో సీతా యజ్ఞం చేయందే వ్యవసాయ కార్యాలు మొదలుపెట్టేవారు కాదు. భూమాతకూ గణమాతకూ పోలికలు ఎక్కువ. ఒకరు పండితే ఇంకొకరు కూడా పండుతారు. గణమాతనే 'కులపా' అని గౌరవించేవారు.

జనులు ఉత్పత్తి విధానాలను పెంచుకొని గుంపుల నుంచి గణాలుగా, గణాల నుంచి జనపదాలలో ఉండే జాతిగా పెరిగారు. జనపదాలు వచ్చాక 'కులపా' కూడా మార్పు చెంది 'జనపద కళ్యాణి' అయింది. ఈ పరిణామం వల్లనే 'కులపా' కాస్తా 'కులట'గా దిగజారి, పతితగా భావించటానికి ఈ పరిస్థితులు ఏర్పడ్డాయి. (కులన్ యటతి ఇతికులటా) ఒక గణం నుంచి ఇంకో గణానికి ద్రిమ్మరేది కులట అయింది. గణమాతగా ఒక్క కులాన్నే అంటిపెట్టుకొనేది జనపదకళ్యాణి కాగా జనపదాలలో సంచరించవలసి వచ్చింది. బౌద్ధ వాఙ్మయంలో జనపద కళ్యాణుల ప్రసక్తి చాలాసార్లు గమనించవచ్చు.

అధోజ్ఞాపికలు

1) పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారి ఆంధ్ర వివరణలతో ఉన్న గౌతమ ధర్మసూత్రములు - పుట 46.
2) సంతోష్ చటర్జీ 'దేవదాసి' - పుటలు 51 నుంచి 59 వరకు.
3) ఆంధ్రప్రదేశం ఆదిమ జాతులు డి ఆర్ ప్రతాప్ - పుట 39.
4) శరద్‌పాటిల్ గ్రంథం పుట 129లో ఉదాహరించిన బ్రయఫాల్ట్ సంపుటాలు 'ది మదర్స్'లో సంపుటి-1, పుట 447



Letter in Hindu

## "Love and trembling...."

Sir, – Many have seen 'Darr' and many have reviewed it as well in the print media but T.G. Vaidyanathan's discovery of the Indian woman's fear of her own sexuality in 'Darr' *(The Hindu, March 27)* is unique in many ways. It really takes a genius of the author's stature to perceive this. *Arta Mishra, Cuttack*

*Hindu - 13-4-1994*

వ్యక్తిత్వవికాసం

# ఆడంబరాలపట్ల - వ్యామోహము

- సి. నరసింహారావు

మన దేశంలో, కుల వ్యవస్థ, వందలాది సంవత్సరాలుగా, పటిష్టంగా, చెక్కు చెదరకుండా నిలచి, ఇది సామాజిక జీవితంలోనే ఒక వాస్తవికతగా రూపొందింది. అలాగే కుల సంప్రదాయాలు, మత ఆచారాలు మన ప్రజల జీవితాలలో ఒక భాగమైపోయాయి. ఈ కుల వ్యవస్థ, మత ధోరణులు, మన ప్రజలలో ఒక భయంకరమైన నిరంకుశ ప్రవృత్తిని అలవాటు చేశాయి. తాము ఉన్నతమైనవని భావించే విలువలకు, వ్యక్తులకు, నాయకులకు, గుడ్డిగా తలవంచడం, ఇతరులు నిర్దేశించిన రీతిలో, తమ జీవితాన్ని తీర్చి దిద్దుకోవడం, మనలో చాలా మందికి ఒక అలవాటయిపోయింది.

## నిరంకుశ ప్రవృత్తి ఛాయలు మీలో కనిపిస్తున్నాయా?

నిరంకుశ ప్రవృత్తిని జీర్ణించుకున్న తండ్రి - భార్య, పిల్లలు, తన చెప్పుచేతలలో ఉండాలని, తనేం చేసినా ఎదురించగూడదని, జవదాటగూడదని ఆదేశించుతాడు. ఇలా తన చుట్టు పక్కల వున్న వారంతా, తనను ఆరాధించుతూ, తన మాట వేదవాక్కులా భావించడం వలన, తండ్రి నిరంకుశ ప్రవృత్తి, యథాతథంగా కొనసాగుతుంటుంది. ఇంతే కాదు. తండ్రిలోని నిరంకుశ ప్రవృత్తిని నిశ్శబ్దంగా, గౌరవంగా ఆమోదించిన కొడుకు, తనలో నిరంకుశ ప్రవృత్తి బీజాలు నాటుకుంటున్నాడు. పెద్ద ఎదిగిన తరువాత, తాను సైతం, నిరంకుశ ప్రవృత్తిని ప్రదర్శించబోతున్నాడు.

మీకు తెలియకుండానే, మీలో నిరంకుశ ప్రవృత్తి చోటు చేసుకొని ఉండవచ్చు. ఆ లక్షణాలు మీలో ఉన్నాయో, లేవో ముందే గుర్తించగలిగితే వాటిని వైదొలగించుకోవడం చాలా సులభం.

ఈ ప్రవృత్తి ఉన్న వ్యక్తులు సందిగ్ధాన్ని, సంశయాన్ని ఏ మాత్రం భరించలేరు. వీరికి అంతా స్పష్టంగా ఉండాలి. ఫలానా వ్యక్తి ఒక కార్యం నెరవేర్చగలడా లేడా, అని ప్రశ్నించినపుడు, వీరికి స్పష్టమైన సమాధానం లభించాలి. అతను శక్తివంచన లేకుండా శ్రమ పడుతున్నాడు. పూర్తి చేయగలడో లేదో వేచి చూద్దామనే సమాధానం వీరికేమాత్రం సహించదు. అలాగే ఏ వ్యక్తి అయినా ఒక పని ప్రారంభిస్తే, అందులో విజయం పొందాడా లేక విఫలమయ్యాడా, అనే స్పష్టమైన కొలబద్దలతోనే వీరు ఎవరినైనా అంచనా కడతారు. కూతురుకు వివాహం చేయాలని సంకల్పించినపుడు, ప్రభుత్వ ఉద్యోగం చేస్తూ, ఖచ్చితమైన జీతం సంపాదించే వ్యక్తినే అల్లుడుగా ఎంచుకుంటారు. అంతేతప్ప వ్యాపారాలు చేసేవారిని, అత్యంత శక్తి సామర్థ్యాలు ఉన్నవ్యక్తుల్ని, వీరు పరిగణనలోకి తీసుకోరు. జీవితంలో ఏం చేయబోతున్నారని ఎదుటివారిని ప్రశ్నిస్తారు. ఫలానా పని చేస్తున్నాను, దాని ఫలితాలెలా ఉంటాయో వేచి చూద్దాం, అనే సమాధానం వీరికెంతో భయంకరంగా తోస్తుంది. వీరికి ప్రతిదీ ఖచ్చితంగా, స్పష్టంగా వుండి తీరాలి. ఇటువంటి వ్యక్తులు, తమ జీవితంలోకి,

తమంతట తాము, కొత్తదనాన్ని ఆహ్వానించలేరు. తమకిష్టం ఉన్నా, లేకపోయినా, తాము చేస్తున్న ఉద్యోగానికి, తమకున్న స్నేహాలకు, తాము వుంటున్న ప్రదేశానికి కట్టుబడి పోతారు.

## జీవితమంతా కఠిన నియమాలమయం

వీరు, జీవితమంతా ఒక పద్ధతి ప్రకారం, ఒక కట్టడితో, కొన్ని నియమాల మధ్య కొనసాగాలనుకుంటారు. అంతేకాదు. ప్రతి ఒక్కరు తమ తమ జీవితాలను ఇదే కోవలో కొనసాగించాలని వీరు ఆదేశిస్తుంటారు. తాము ఆశించినట్లు ఏ చిన్న పని జరగకపోయినా, వీరు అమితంగా తల్లడిల్లిపోతారు. తమ ఇంట్లో ఒక విందు జరుగుతుంటుంది. చిన్నపిల్లవాడొకడు గ్లాసులోని మజ్జిగ నేలపై పారబోసాడు. ఆ చిన్న సంఘటన ఒకటి చాలు, వీరు ఇక ఆ రోజంతా తల్లడిల్లిపోవడానికి. అంతేకాదు. కుటుంబ సభ్యుల్లో తమ కెవరు ఎదురు చెప్పినా వీరు సహించలేరు. తాము అందరి శ్రేయస్సును కోరుకుంటున్నారు గనుక, తమను ప్రశ్నించే వారంతా పతనమైపోతున్నారని వీరు ఆరోపిస్తారు. వీరి ఆలోచనా ధోరణి, ఎంతటి అవాస్తవికంగా ఉంటుందంటే, వీరు ఐదేళ్ళ వయసు పిల్లలను సైతం 'జీవితంలో ఏం కావాలనుకుంటున్నావ్' అని ప్రశ్నిస్తారు. పిల్లలు డాక్టర్లో, ఇంజనీరో కాబోతున్నామని చెబితే, ఆ స్పష్టత చూసి వీరు ముచ్చట పడతారు. వీరు, ఇంట్లో వస్తువులు, ఏ మాత్రం చెల్లా చెదురుగా ఉన్నా భరించలేరు. ప్రతి వస్తువూ దాని స్థానంలో అది ఉండి తీరాలని, వీరు అనేకసార్లు చెబుతూ ఉంటారు. అలాగే తమ పిల్లలు స్కూలులో ఉపాధ్యాయులు చెప్పినట్లు నడుచుకోవాలని, ఉపాధ్యాయులకు ఏ సందర్భంలోనూ ఎదురు మాట్లాడరాదని, స్కూలు క్రమశిక్షణను తు.చ. తప్పకుండా పాటించాలని వీరు కఠినంగా ఆదేశిస్తుంటారు.

## నూతన అనుభవాలను ఆహ్వానించలేరు

అలాగే, వీరు తమ ఖర్చుల వివరాలను, ఒక్క పైసా తేడా లేకుండా ఎప్పటికప్పుడు వ్రాసుకుంటుంటారు. శెలవులలో ఎక్కడెక్కడకు వెళ్ళాలో, ఏ రోజు ఎవరితో గడపాలో ముందుగానే నిర్ణయించుకుంటారు. తమ పథకానికి అనుగుణంగాలేని ఏ పనిని చేయడానికైనా వీరు తల్లడిల్లిపోతుంటారు. రైలులో రిజర్వేషన్ లేకుండా ప్రయాణించాలంటే, వారు, అందుకెన్నడూ సిద్ధం కాలేరు. అలాగే జీవితంలో నష్టపోయినవారందరూ, తమ తమ జీవితాలను ఒక ప్లాన్ లేకుండా గడపడం వల్లనే అలా నష్టపోవడం జరిగిందని, వీరు నిర్ణయించేస్తారు. ఇటువంటి నిరంకుశ ప్రవృత్తి ఉన్న వ్యక్తులందరూ తమ తమ జీవితాలను, ఒక పద్ధతి ప్రకారం, ఒక పథకం ప్రకారం గడుపుతున్నారని పైకి అనిపిస్తుంది. కాని వారు జీవితంలో పైకెదిగే అవకాశాలను వేటినీ అన్వేషించలేరు. వాటిని సాధించడానికి ప్రయత్నించరు.

అలాగే ఇటువంటి వ్యక్తులు, ఎక్కడైనా ఉద్యోగం చేస్తున్నప్పుడు, తమ పక్క సీట్లో ఉన్న వ్యక్తి ఎవరినో చూసి నవ్వినా, లేక ఇంకో ఉద్యోగితో గుసగుసలాడినా, ఆ విషయమేమిటో తెలుసుకునే వరకు, వీరు స్థిమితపడలేరు. అలాగే, తమ తోటి ఉద్యోగస్తులకు, వారి వారి జీవితం ఎలా ఉండాలో, ఎప్పటికప్పుడు వీరు సలహాలిస్తూ ఉంటారు. అదే కోవలో తాము ఐదేళ్ళ తరువాత, పదేళ్ళ తరువాత, పదిహేనేళ్ళ తరువాత ఏం చేయబోతున్నామో, ముందుగానే పథకాలు సిద్ధంచేసి అందరికీ ఆ విషయాలు చెబుతారు.

## ప్రపంచాన్నంతటినీ రెండుగా విభజించి వేయవద్దు

ఈ నిరంకుశ ప్రవృత్తిని ప్రదర్శించే వ్యక్తులు మొత్తం సమాజాన్ని, సంఘటనల్ని, వ్యక్తుల్ని రెండే రెండు రకాలుగా విభజించివేస్తారు. మంచివారు, చెడ్డవారు. మంచిపని, తప్పుపని. మిత్రుడు, విరోధి ఇలా ప్రతి దాన్ని విభజించి చూడటం, వీరికి మానసిక అవసరంగా రూపొందుతుంది. మన ఆలోచనలన్నింటినీ, ఇలా రెండుగా విభజించడం అన్ని చోట్లా సాధ్యం కాదు. మగవారిని, ఆడవారిని, రెండు వర్గాలుగా విభజించవచ్చు. అలాగే ఆవులను గేదెలను విడదీయవచ్చు. కాని నిరంకుశ ప్రవృత్తి ఉన్న వ్యక్తులు ఇలా విభజించడానికి వీలు లేని వాటిని కూడా విభజించుతూ ఒక నిర్ణయం ప్రకటించడానికి ఆత్రుత పడిపోతుంటారు. ఉదాహరణకు వారు వ్యభిచారిణులు సమాజాన్ని కలుషితం చేస్తున్నారని, అటువంటి వారిపై ఏ మాత్రం కరుణ కనపర్చకూడదని చెబుతారు. వ్యభిచారిణులు, బీదరికంలో మ్రగ్గుతూ, ఇష్టం లేకపోయినా ఆ వృత్తిలో ఉన్నారని, జీవించడానికి ఉపాధి కల్పించితే, వారు కూడా గౌరవప్రదంగా జీవనం సాగించగలరని ఎవరైనాచెప్పబోతే వీరు తీవ్రంగా మండిపడతారు. వ్యభిచారానికి అనుకూలమో, వ్యతిరేకమో తేల్చి చెప్పమని నిగ్గదీస్తారు. అలాగే వీరు ఒక రాజకీయ పార్టీని బలపర్చుతూ, మిగిలిన పార్టీలన్నిటిని తీవ్రంగా దూషిస్తారు. తాము అభిమానించే పార్టీలో కొన్ని మంచి లక్షణాలను, ఇతర పార్టీలలోని చెడ్డ లక్షణాలను గురించి మాత్రమే, వీరు ఒకటికి పదిసార్లు చెప్పబోతారు. అలాగే వీరు, ఇతర కులాలు, మతాల పట్ల కూడా, స్పష్టమైన అభిప్రాయాలను ప్రకటిస్తుంటారు. ఫలానా రాష్ట్రానికి చెందిన వారిని నమ్మకూడదంటారు. ఫలానా వ్యాపారం చేసే వాళ్ళందరూ మోసగాళ్ళంటారు. ఫలానా కులానికి చెందిన వాళ్ళంతా తెలివి తక్కువ వారంటారు.

ఈ నిరంకుశ ప్రవృత్తిని ఆదరించే వారందరికీ ప్రతి అంశం పట్ల, కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలుంటాయి. అందుకు భిన్నమైన అభిప్రాయాలు, ఎవరు వెల్లడించబోయినా, వాటిని ఏ మాత్రం అంగీకరించరు. తనతో విభేధించేవారితో పెద్దగా అరుస్తారు. మండిపడ తారు, దూషిస్తారు. ఎదుటివారు చెప్పేవి అర్థం చేసుకోవడానికి, ఏ మాత్రం ప్రయత్నించక పోగా 'ఇంత తెలివైనవాడివి ఇలా మాట్లాడతావని నేను ఆశించలేదు' అంటూ వ్యాఖ్యానిస్తారు. ఇటువంటి వ్యక్తులు, వాదనలో ఓడిపోవడాన్ని ఏ మాత్రం భరించలేరు. చివరకు ఎదుటివారి మీద దౌర్జన్యం చేయడానికి కూడా సంసిద్ధమవుతారు. ఇతరులతో ఒక అంగీకారానికి రావడానికి వీరు ససేమిరా అంగీకరించరు. వీరికి అంతరంగిక మిత్రులంటూ ఎవరూ ఉండరు. భార్యగాని, పిల్లలుగాని, వీరికెవరూ నచ్చజెప్పలేరు.

## తమ పాత అభిప్రాయాలే ఖచ్చితమైన వాస్తవాలనుకొంటారు

కాలేజిలో చదువుతున్న కూతురుకు ఒక యువకుడు ఫోన్ చేస్తాడు. విషయం తెలిసిన తండ్రి కూతుర్ని నానా హింసలు పెడతాడు. ఎంతగానో తిడతాడు. ఆ యువకుడెవడో ఫోన్ చేయడం వలన, తన ప్రతిష్ఠ గంగలో కలిసిందంటాడు. కూతురు, ప్రేమిస్తున్నానని చెబితే తండ్రి తీవ్రంగా తల్లడిల్లిపోతాడు. ప్రేమించడానికి, వ్యభిచరించడానికి పెద్ద తేడా లేదని నిందిస్తాడు. ఆ యువకుడు ఎటువంటివాడు? వీరిద్దరి ప్రేమను ఆమోదించి, వారికి వివాహం చేస్తే ఏమవుతుంది? ఈ ఆలోచనలే ఆ తండ్రి మనసులోకి జొరబడలేవు. పెద్దలు కుదిర్చిన వివాహం చేసుకోవడమే సరైన పని. అందుకు భిన్నంగా ప్రవర్తించడమంటే అది

చెడిపోవడం క్రిందే లెక్క. ఈ నిరంకుశ ప్రవృత్తి వున్న తండ్రి, సమాజాన్ని ఎదిరించి, ప్రేమ వివాహాలు చేసుకున్న వారి జీవిత చరిత్రలన్నిటిని ఏకరువు పెడతాడు. ఎవరెవరు ఎలా ఎలా నాశనం అయిపోయారో, ఎలా ఆత్మహత్యలకు ఒడిగట్టారో వివరిస్తాడు. ప్రేమ వివాహాలు చేసుకొని, హాయిగా జీవనం సాగిస్తున్న వారిని గురించి వినడానికే తండ్రి ఏ మాత్రం అంగీకరించడు. ఇటువంటి వ్యక్తులు తమ అభిప్రాయాలకు, అనుగుణమైన అభిప్రాయాలు ప్రకటించే దినపత్రికలు మాత్రమే చదువుతారు. ఇతర దినపత్రికలన్నీ అబద్ధాలు వ్రాస్తుంటా యని, వార్తలను వక్రీకరిస్తుంటాయని చెప్పబోతారు. భిన్న అభిప్రాయాలు ప్రకటించే వ్యాసాన్ని, ఎప్పుడైనా పొరపాటుగా చదివినా, ఆ వ్యాస కర్తకు ఏమీ తెలియదని తిట్టిపోస్తారు.

## మార్పును సహించలేరు

వీరు, తమ జీవితంలో, మార్పును ఏ మాత్రం సహించలేరు. ప్రస్తుతం నివశిస్తున్న పట్నం నుండి, తమ పిల్లలందరూ ఉద్యోగం చేస్తున్న నగరానికి వెళదామని, భార్య చెబితే వీరు ససేమిరా అంగీకరించరు. మార్పును ఆమోదించలేమని అంగీకరించకుండా, తమ ఏకాంతా నికి భంగం కలుగుతుందని, ఆ నగరంలో ప్రశాంతంగా జీవించడం సాధ్యం కాదని చెప్పబోతారు. వారికి, తాము చేస్తున్న ఉద్యోగం ఏ మాత్రం నచ్చకపోతే, తమ పై ఉద్యోగిని, క్రింది ఉద్యోగులను, తిట్టిపోస్తారే తప్ప, సర్దుకుపోవడానికి ఏ మాత్రం ప్రయత్నించరు.

ఆలోచనలన్నీ ఇలా ఒకే రీతిలో ఉండటం, పైగా అవే నిజమని గాఢంగా విశ్వసించడం మనసును ఓ జబ్బులా వేధిస్తుంది. అంతేకాదు. ఇటువంటి ఏకోన్ముఖంగా వుండే ఆలోచనా ధోరణి, మొత్తం జీవితాన్ని, జీవితంలో తీసుకునే ప్రతి నిర్ణయాన్ని, ప్రభావితం చేస్తుంటుంది. ఇటువంటి వ్యక్తులు ఎప్పుడూ విసుగుకు, ఆందోళనకు, ఉద్రిక్తతకు, లోనవుతూనే ఉంటారు. వాటిని తొలగించుకోవడానికి, వీరు ఎటువంటి ప్రయత్నం చేయరు. చేయలేరు. తమ ఆలోచనలలోగాని, తమ ప్రవర్తనలోగాని, ఎటువంటి మార్పును, వీరు ఆహ్వానించలేరు.

## సృజనాత్మకత వుండే రంగాలను అపహాస్యం చేస్తారు

ఇటువంటి నిరంకుశ ప్రవృత్తిని జీర్ణించుకున్న వ్యక్తులు, మేధావులనూ, కవులనూ, రచయితలనూ అపహాస్యం చేస్తుంటారు. ఇటువంటి మేధావులు ప్రపంచ జ్ఞానంలేని వారని, నాలుగు గోడల మధ్య కూర్చుని, తమకిష్టం వచ్చినది వ్రాసి పారేస్తారని చెబుతారు. అలాగే, తమ పిల్లలు పరీక్షలలో ఎక్కువ మార్కులు తెచ్చుకున్నారని విని సంతోషిస్తారే తప్ప, పెయింటింగ్‌లోనో, సంగీతంలోనో రాష్ట్ర స్థాయి అవార్డులొచ్చాయన్నా పట్టించుకోరు. అలాగే, ప్రిన్సిపాల్‌కు వ్యతిరేకంగా, సమ్మె చేయిస్తున్న కొడుకును, ఏ మాత్రం క్షమించరు. అలాగే, కవిత్వం, సాంస్కృతిక రంగం, మోడరన్ పెయింటింగ్ వీరికి ఏ మాత్రం నచ్చవు. ఆ కవిత్వం ద్వారా, కవి ఏం చెబుతున్నాడని మొరటుగా ప్రశ్నిస్తారు. ఈ కళలన్నిటిలోను ఒక సత్యం, సౌందర్యం దాగి ఉంటాయి. అవి, విభిన్న వ్యక్తులకు, విభిన్న రకాలుగా అర్థమవుతుంటాయి. కాని వాటిలో అస్పష్టత ఉంటుంది. నిరంకుశ ప్రవృత్తిని ఆదరించే వ్యక్తులు, ఇటువంటి అస్పష్టతను ఏ మాత్రం సహించలేరు. అంతేకాదు. కళారంగంలో ఉన్నవారు గాని, కళల్ని ఆరాధించేవారు గాని, సక్రమమైన జీవితాన్ని గడుపుతున్నవారు కాదని, వీరు చెప్పబోతారు. ఎటువంటి విలువలు లేనివారని, అక్రమ లైంగిక సంబంధాలను పెట్టుకుంటారని నిందిస్తారు. అలాగే ప్రముఖ మేధావులను, కళాకారులను వీరు కలవరు.

ఎప్పుడూ పుస్తకాలతో తలమునకలౌతుంటారని, ప్రపంచాన్ని గురించి పట్టించుకోరని మాటిమాటికి చెప్పబోతారు. ఇటువంటి నిరంకుశ ప్రవృత్తి ఉన్న వ్యక్తులు, పెద్ద పెద్ద చదువులు చదివినప్పుడు వారి పరిస్థితి మరీ ఘోరంగా తయారవుతుంది. వారు తమ చదువుకు సంబంధం లేని పనులు అనేకం చేయబోతారు. జ్యోతిష్య రహస్యాలు వివరించుతూ అనేక గ్రంథాలు వ్రాస్తారు. ఒక స్వామీజీ దగ్గరకు చేరతారు. ఆ స్వామీజీ చెప్పే ఉపన్యాసాల న్నింటిని, తమకున్న విషయ పరిజ్ఞానంతో జోడించి, క్రొత్త రకం వ్యాఖ్యానాలు చేస్తారు. తమకు ఒక డిగ్రీ ఉంటే దానితో సంతృప్తి పడకుండా, ఇంకా ఐదారు డిగ్రీలు సంపాదించడానికి ప్రయత్నిస్తారు. అలాగే భగవద్గీతనో, వేదాలనో పరిశోధించి, కొంగ్రొత్త రహస్యాలు కనుగొ న్నామని చెపుతుంటారు. ఇతరులకు భిన్నమైన వారమని, తాము అసాధారణ మేధావులమని ప్రకటించుకుంటుంటారు.

నిరంకుశ ప్రవృత్తిని కనపరచే వ్యక్తులు, ఏనాడూ, ఆత్మ పరిశీలన చేసుకోవడానికి సంసిద్ధం కారు. వారు, ఏ పనినైనా, ఎందుకు చేస్తున్నామో గుర్తించడానికి నిరాకరిస్తారు. తమ ఆలోచనలను, ప్రవర్తననూ, మార్చుకోవాలంటే, తాము ఇంత కాలము తప్పు చేస్తున్నామని గుర్తించకలగాలి. వారలా గుర్తించడానికి సిద్ధం కారు గనుకే, వారు మార్పును అంగీకరించ లేరు. వారు, తమ గొప్పతనాన్ని ప్రదర్శించడానికి, తమపిల్లలు బాగా చదువుకోవడం, తమ సంపాదన, తమ ఇల్లు, తమకు వున్న వస్తువులు, భార్యకు ఉన్న నగలు, వీటి పైనే ఆధారపడతారు. ఇంకా ఇంకా ఎక్కువ సంపాదించగలిగితే, తమ విలువ, ప్రతిష్ఠ ఇనుమడిస్తుం దని వీరు విశ్వసిస్తారు. తమను తాము అంచనా వేసుకోవడానికై, పూర్తిగా, బాహ్య శక్తులపైనే ఆధారపడటం వలన, అంతరావలోకన అవసరాన్ని వీరు గుర్తించరు. తమ జీవితంలో అనేక ఇబ్బందులు ఎదురవుతున్నా, నిరంతరం ఇతరులతో కలహాలు చెలరేగుతున్నా, వీరు తమలో ఏదైనా లోపముందేమోనని ఆలోచించరు.

## గతానికి అంటిపెట్టుకు వుంటారు

ఈ నిరంకుశ ప్రవృత్తి ఉన్న వ్యక్తులు, ఇలా నిరంకుశ ధోరణితో ప్రవర్తించడమే కాదు. ఇతరులందరిలా ఉండాలని, అంటే సమాజంలో అధిక సంఖ్యాకులు ప్రవర్తిస్తున్న రీతిలో, ప్రవర్తించాలని ప్రయత్నిస్తుంటారు. అలాగే, తాము ఆరాధించే వ్యక్తులకు, తమ కంటే అధికులని భావించేవారికి, పూర్తి విధేయతను ప్రకటిస్తారు. వీరి ప్రవర్తన అంతటిని, వివిధ సామాజిక శక్తులే ప్రభావితం చేస్తుంటాయి. సమాజంలో కులాంతర వివాహాలకు, పెద్దగా ఆదరణ లేదు గనుక వీరు కూడా కులాంతర వివాహాలను వ్యతిరేకిస్తారు. ప్రజలందరూ కాంగ్రెస్‌ను గెలిపిస్తుంటే వీరు ఆ పార్టీకే ఓటేస్తారు. సమాజానికి ఎదురీది జీవించడం కష్టమని, వీరు ఒకటికి పది సార్లు చెబుతుంటారు. అలాగే, వీరు మభ్యపరిచే ప్రకటనలను తేలికగా నమ్మేస్తుంటారు. ఒక గొప్ప నటి, ఒక ప్రముఖ వ్యాపార వేత్త, ఫలానా సబ్బు వాడమని ప్రకటనలలో చెబితే, వీరు, జీవితాంతం ఆ సబ్బునే వాడుతుంటారు. ఇలా నిరంకుశ ప్రవృత్తిని అలవరచుకున్న వ్యక్తులు, తమ తల్లితండ్రులను, అత్యంత పవిత్ర భావనతో చూస్తారు. తమ తల్లితండ్రులను ఎవరైనా విమర్శించితే, వీరు ఏమాత్రం సహించలేరు. అలాగే తమ పిల్లలు తమకు ఎదురు తిరిగితే భరించలేరు. అంతేకాదు. తమ పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయి, వివాహాలు చేసుకున్న తరువాత కూడా, వారిని శాసించడానికి, వారిపై పెత్తనం చేయడానికి, ప్రయత్ని

స్తుంటారు. మాటిమాటికి, 'మన కుటుంబ ఆచారాలను ఎదిరిస్తావా, పెద్దల్ని కాదంటావా' అని ప్రశ్నించబోతారు. అలాగే వీరు ఒక వైద్యుడు ఇచ్చిన సలహాను అతి ఖచ్చితమైనదిగా, పవిత్రమైనదిగా భావిస్తారు. తమ పిల్లలను కూడా , అలా వైద్యుల సలహాలను తు.చ. తప్పకుండా అనుసరించమంటారు. అలాగే చట్ట విరుద్ధమైన పనులేం చేయడానికి, వీరు ఎప్పుడూ సంసిద్ధులు కారు. అసలు, చట్టాలే లోప భూయిష్టమై ఉండవచ్చునని, ఆ చట్టాలను మార్చవచ్చని, వీరు అంగీకరించనే అంగీకరించరు.

నిరంకుశ ధోరణి కనబరచే వ్యక్తులు, తమ మతం, తమ కులం, చాల గొప్పవని, వీటితోపోల్చకలిగినవి, ఈ ప్రపంచంలో మరేవి లేవని చెప్పబోతారు. ఇతరులందరి రూపురేఖలు, వారి ఆచార వ్యవహారాలు, తమకు భిన్నంగా ఉంటాయి. కనుక వారందరూ తమకంటే తక్కువవారని గాఢంగా విశ్వసిస్తారు. ఇలా, కులానికి, మతానికి, అంటిపెట్టుకొని ఉండటం, చాల గొప్ప విషయంగా కూడా వీరు పరిగణిస్తారు. తమ పిల్లలకు కూడా అవే విషయాలను ఒకటికి పదిసార్లు బోధిస్తారు. హైదరాబాదులో మతకల్లోలాలు జరిగాయన్న వార్త వినగానే , ఆ వివరాలేమీ తెలియకపోయినా, తప్పంతా ఎదుటి మతం వారిదే అయి వుంటుందని ప్రచారం చేస్తారు. అలాగే, వీరు ఎప్పుడూ అధిక సంఖ్యాకుల పక్షాన నిలచి, అల్ప సంఖ్యాకులను అవహేళన చేస్తుంటారు. దేశంలో అధికారంలోకి వచ్చే రాజకీయ పార్టీలను మాత్రమే వీరు అభిమానిస్తారు. అధికారంలో ఉన్న పెద్ద పార్టీ వున్నట్లుండి పరాజయం పాలైతే, తిరిగి అధికారంలోకి వచ్చిన పార్టీని, వీరు అభిమానించడం ప్రారంభిస్తారు.

## ప్రపంచమంతా మారిన తరువాత వీరు మారతారు

అలాగే , ఫ్యాషన్లు ఎప్పటికప్పుడు మారుతుంటే, కొత్తగా వస్తున్న మార్పులను, వీరు ముందుగా తీవ్రంగా అవహేళన చేస్తారు. తోటి వారిలో కేవలం పది శాతం మందే, బెల్ బాటం ప్యాంట్లు వేసుకుంటుంటే, వారిని అవహేళన చేసి, తిరిగి, తొంభయి శాతంమంది, వాటిని ధరిస్తున్నప్పుడు, వీరు కూడా గుట్టు చప్పుడు కాకుండా ఆ రకం ప్యాంట్లనే కుట్టించుకుంటారు. ఆ ఫ్యాషను మళ్లీ మారిపోతుంటే, వీరు, పూర్వంలాగానే ముందుగా విమర్శిస్తారు. చివరకు అనుసరిస్తారు. తమ పట్ల, తమ ఆలోచనా ధోరణి పట్ల, ఏ మాత్రం గౌరవం లేని వ్యక్తులు, ఇలా అత్యధిక శాతం మంది ప్రజల నడవడికను మౌనంగా అనుసరిస్తుంటారు. వ్యవస్థాగతంగా స్థిరపడిన విలువలను వేటినైనా ప్రశ్నించడానికి వీరు ఏనాటికీ సంసిద్ధం కాలేరు.

మన దేశంలో, పూర్వం సతీ సహగమనాన్ని, ఒక పవిత్ర కార్యంలా భావించేవారు. భర్త చనిపోతే, భార్యను సైతం, చితి ఎక్కించి చంపేసేవారు. అలాగే, రెండు-మూడు సంవత్సరాల పసి కూనలకు వివాహం చేసి, పెళ్లి చేసుకున్న పిల్లవాడు ఏ కారణంగానయినా చనిపోతే, ముక్కుపచ్చలారని ఆడపిల్లల్ని, విధవరాలుగా ముద్ర వేసి, వెలివేసేవారు అలాగే, దేవతల తృప్తి కోసమని జంతు బలులు, నర బలులు ఇచ్చేవారు. తోటి మనుషులను బానిసలుగా నియమించుకునేవారు. నిరంకుశ ప్రవృత్తిని ఆదరించే వ్యక్తులెవరూ, ఆ రోజులలో ఇవి చెడ్డవని చెప్పిన పాపాన పోలేదు. పైగా సంఘ సంస్కర్తలను హేళన చేసి వారిలో లోపాలు వెదికేవారు.

## విపరీతమైన ధోరణులు, అపసవ్యమైన ఆలోచనలు

ఈ నిరంకుశ ప్రవృత్తి మరీ ముదిరినపుడు మానసిక వైపరీత్యానికి త్రోవతీస్తుంది. తాము చాల గొప్పవారమని భావిస్తూ, ఇతరులు సైతం, తమ గొప్పతనాన్ని గుర్తించి, గౌరవించాలని ఎదురుచూస్తారు. అలా ఇతరులు గుర్తించనపుడు, వారు తమకు వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నారని ఆరోపిస్తుంటారు. ప్రతి సాధారణమైన విషయానికి, సంఘటనకు వెనుక, ఏవో కుట్రలు ఉన్నాయని అనుమానిస్తారు. వాస్తవాన్ని గుర్తించడానికి పూర్తిగా నిరాకరిస్తూ, తమదైన ఊహా జనిత జగత్తును సృష్టించుకొని, అందులో కాలక్షేపం చేస్తుంటారు. వీరు ప్రపంచమంతా నాశనం అయిపోయిందని, నమ్మదగిన వ్యక్తి ఒక్కడూ లేడని, నిర్ణయిస్తారు. వీరితో పనున్న వ్యక్తి, వీరిని విపరీతంగా పొగిడి, తన పనిని చేయించుకు పోవడం, అతను మళ్లీ కనుపించకపోయేసరికి, అందరూ మోసగాళ్ళేనన్న తమ పూర్వ నిర్ణయాన్ని, వీరు మరింత దృఢపరచుకోవడం, జరుగుతుంటుంది. వీరు ప్రపంచంలో జరిగే సంఘటనలు ఏవైనా, తమకూ ఎదురు కావచ్చని ఒక విపరీతమైన తర్కాన్ని ప్రవేశపెడ్తారు. ఈ ప్రపంచం అత్యంత ఘోరమైనదని, వీరు భావిస్తుంటారు. ఫలితంగా వీరికి ప్రపంచం అలాగే దర్శనమిస్తుంటుంది.

నిరంకుశ ప్రవృత్తిని ఆదరించేవారు నిస్సహాయులగు, నిరుపేదలను, చాల అసహ్యించుకుంటారు. బలహీనులంటేనే, వీరికి ఎక్కడా లేని మంట. సమాజం ఇంతటి అధ్వాన్న స్థితిలో ఉండడానికి కారణం, ఇక్కడి పేద ప్రజలేనని వీరు చెప్పబోతారు. పేద ప్రజలు సమాజానికి ఓ శనిలా దాపురించారని వీరు విసుక్కుంటుంటారు. అలాగే తన కొడుకులలో భార్యను కొట్టే వారిని మందలించుతారు. అదే సమయంలో భార్య సలహాలు వినే కొడుకును, ఎందుకూ పనికిరాని చవట దద్దమ్మ అని ఈసడించుకుంటారు. అలాగే మన ప్రభుత్వాలు పేద ప్రజలకు, రేషన్ బియ్యం, పక్కా గృహాల నిర్మాణం వంటివి చేపట్టి, వారిని నాశనం చేస్తున్నాయని, ప్రజలందరిమీద భారం మోపుతున్నాయని నిందిస్తారు. వాళ్లకు, ప్రభుత్వం ఎందుకు సహాయపడాలని వాదిస్తారు.

## బాహ్యాడంబరాల పట్ల అంతులేని వ్యామోహం

ఈ నిరంకుశ ప్రవృత్తిని జీర్ణించుకున్న వ్యక్తులు, అధికారాన్ని, దర్పాన్ని, సంపదను, హోదాల్ని, అరమరికలు లేకుండా ఆరాధిస్తారు. తమ గొప్పతనం చాటుకోవడానికి, తమకు అవసరం ఉన్నా లేకపోయినా, పెద్ద పెద్ద కార్లు కొంటారు. లోపలెంత యిరుకుగా ఉన్నా పైకి మాత్రం అందంగా కనుపించే భవంతులను నిర్మిస్తారు. ఈ సమాజంలో ప్రతి విశేషాన్ని, ప్రతి వ్యక్తిని, డబ్బుతో కొలవడాన్ని అలవాటు చేసుకుంటారు. తాము ఎంత ఖర్చు పెట్టి కారు కొన్నదీ, దాని పెట్రోలుకు ఎంత ఖర్చు అవుతున్నదీ, అసందర్భంగా అందరికీ తెలియజేస్తుంటారు. తమ పిల్లవాడికి ఎంతటి కట్నం వచ్చిందో, తమ అమ్మాయికోసం ఎంతటి గొప్ప సంబంధాలు చూస్తున్నామో, తమ బంధువులు ఎంతెంతటి గొప్ప హోదాలో వున్నారో, వీరు విసుగు లేకుండా చెబుతుంటారు. నిరంతరం వీరిని నడిపించేవి, నిర్దేశించేవి బాహ్య శక్తులే గనుక, వీరు, బాహ్యాడంబరాలు చూసే విపరీతంగా మురిసిపోతుంటారు. ఫలానా విహార యాత్రకు వెళ్ళావా అని, ఎవరైనా ప్రశ్నించితే, వెనువెంటనే అందుకు ఎంత

ఖర్చయిందో తెలియజేస్తారు. పైగా వీరిలో మరో లక్షణం కూడా వుంటుంది. పోలీసులు, మిలిటరీ చాల ఉన్నతమైన వారని, రాజకీయవేత్తలు వారి పనిలో జోక్యం చేసుకోవడంవలన, వారు తమతమ కర్తవ్యాలను సరిగా నిర్వర్తించలేక పోతున్నారని చెబుతుంటారు. మన దేశానికి మిలిటరీ పాలన వస్తే తప్ప, మనం బాగుపడమని నొక్కి వక్కాణిస్తారు. యుద్ధం వస్తే ఏ దేశమైనా బాగుపడుతుందని, అందుకు జర్మనీ, జపాన్‌లే ఉదాహరణలని చెబుతూ, యుద్ధం రావాలని కోరుకుంటుంటారు. ఇటువంటి వ్యక్తులలో, దేశభక్తి భావన హద్దులు మీరుతుంటుంది. తన జాతీయ పతాకాన్ని చూసినా, జాతీయ గీతాన్ని విన్నా, ఆవేశం కట్టలు తెంచుకుంటుంది. తమ దేశంతో విరోధం ప్రకటించే దేశాలన్నీ దుర్మార్గమైనవని, ఆ దేశంలోని ప్రజలు కూడా దుర్మార్గులేనని వాదించబోతారు.

నిరంకుశ ప్రవృత్తిని సంతరించుకున్న వ్యక్తులలో ఉండే సాధారణ లక్షణాలన్నిటిని పైన పేర్కొనడం జరిగింది. వీటిలో ఏయే లక్షణాలు, మీకున్నాయని అనుమానిస్తున్నారో, వాటిని మీ నోట్ బుక్‌లో గుర్తించండి. పై వాటిలో కొన్ని లక్షణాలు మీలో బలీయంగా ఉండివుండవచ్చు. మరికొన్ని లీలామాత్రంగా ఉండవచ్చు. అలాగే కొన్ని సందర్భాలలో మీరు కొన్ని కొన్ని లక్షణాలను వ్యక్తం చేయవచ్చు. అలాగే ఇతర సందర్భాలలో మరికొన్ని వ్యక్తం చేయవచ్చు.

మీకు తెలిసిన వ్యక్తులలో, ఎవరెవరు ఏయే లక్షణాలు ప్రదర్శిస్తుంటారో, మీ నోట్ బుక్‌లో గుర్తించండి. అలాగే నిరంకుశ ప్రవృత్తి మీలో ఏయే సందర్భాలలో మాత్రమే, అధికంగా వ్యక్తం అవుతుందో మీ నోట్ బుక్‌లో గుర్తించండి. ఆ లక్షణాలను వీలైనంతటి వరకు అదుపు చేయాలని నిశ్చయించుకోండి. ★

"వ్యక్తిత్వ వికాసం" గ్రంథంగా వెలువడింది - దొరుకుచోటు MINI INTERNATIONAL, 27-1-127, Eluru Road, Vijayawada-520 002.

---

## Prosperity - set of values

Prosperity brings a certain materialist set of values. It brings about changes in behavior. If you know this any you set out consciously to prevent certain core values from being eroded, you stand a better chance of preserving basic standards.

Change is unavoidable, but that need not dissolve you way of life. Whether you can maintain your basic values depends on whether you are able to maintain your basic family network. If you can't, you are in trouble.

Most psychotherapy is not about mental illness but about values-about the value dilemmas of sane and ordinary people trying to lead a life amidst great personal, familial, and cultural confusion.

*Singapore Minister Lee*

# క్యూబిజం

- మాకినీడి సూర్యభాస్కర్

ఇంప్రెషనిజం తరువాత కాలంలో వచ్చిన 'పోస్టు ఇంప్రెషనిజం' లో ప్రధానమైన ప్రక్రియ క్యూబిజం. క్యూబిజం సూత్రధారి పాల్ సజాన్. ఈయన దృశ్య ప్రకృతిని రేఖాగణిత రూపాల్లో కనుగొని, బాహ్య జగత్తులోని ప్రతిరూపం ఘనాకృతిలోనో, స్తంభాకృతిలోనో, వృత్తాకృతిలోనో ఉంటుందని వివరించాడు. ఈ నియమాల ఆధారంగా చిత్రకళను నిర్మాణాకృతిలోనికి రూపొందించాడు పాబ్లో పికాసో. సజాన్ 1906లో మరణించాడు. పికాసో తన మొదటి క్యూబిస్టు చిత్రాన్ని 1907లో చిత్రించాడు.

నిజానికి క్యూబిజం సంవిధానం (technique) ప్రాచ్యదేశాలకు చెందిందే. దీనికి మూలం నీగ్రోల దారుశిల్పం. దానినే నానావిధాలుగా మార్చి చిత్రకళలో క్యూబిజంగా మార్చారు. 1907లో పికాసో నీగ్రోవారి దారు శిల్పాలను సందర్శించడం తటస్థించింది. దానితో చిత్రకళ క్రొంగొత్త పుంతలు త్రొక్కింది. పికాసో ఏడు సంవత్సరాలపాటు క్యూబిజంలో కృషిచేసి నూతనమైన రూపాలనెన్నో సృజించాడు.

ప్రతి వస్తువు కంటికి గోచరమయ్యే బాహ్యాకృతితోపాటు అగోచరమైన అంతరంగాకృతి నొకదానిని కలిగి ఉంటుంది. ఆ అంతరంగికాకృతి క్యూబ్‌ల ద్వారా, అంటే కోణీయ రూపాలతో నిర్మించబడు తుందని యెంచి క్యూబిస్టులు ఒక మనిషి ముఖాన్ని సైతం క్యూబ్‌ల రచనల్లో చిత్రిస్తారు. చూడగానే ముఖం కాక పేర్చిన క్యూబ్‌లు మాత్రమే కనబడతాయి. పరిశీలిస్తే గాని ముఖం పోలిక కనుపించదు. అదీకాక, ముఖాన్ని ముందు భాగం నుంచి చిత్రిస్తూ వెనుకభాగాన్నీ, ప్రక్కలనున్న భాగాలనూ కూడా ఒకేసారి ముందు భాగంలో చూపడం కూడ ఈ విధానంలో కద్దు . ఈ కళ ఒక రేఖాగణితం వంటిది. ప్రతి ఆకృతిని క్యూబ్‌ల రచనలో చూపించి సంతృప్తిచెందక, పికాసో ప్రతి రూపానికీ ఒక విశిష్టమైన వర్ణాన్ని సైతం సృష్టించాడు. ఈయన సృజించిన రూపాలు గొప్ప గణిత ప్రహేళికలు.

క్యూబిజం రెండు విధాలు - విశ్లేషణాత్మకం, సంశ్లేషణాత్మకం. పికాసో క్యూబిజం విశ్లేషణాత్మకం. అసలు రూపాన్నే క్యూబ్‌లుగా విభజించిన తర్వాత చిత్రిత ఆకారాలను కూర్చడం యిందులోని సూత్రం. ఇలా చిత్రించిన చిత్రం ఎలా ఉంటుందంటే, అద్దంపైన చిత్రించాక, ఆ అద్దాన్ని పగులగొట్టి, పగిలిన ముక్కల్ని మళ్లీ ప్రక్క-ప్రక్క చేర్చి చూస్తే ఎలా ఉంటుందో అలా ఉంటుంది.

సంశ్లేషణాత్మక క్యూబిజంలో అసలు రూపం విడగొట్టబడదు. ఈ రకం చిత్రణ మనకు బాగా గగనేంద్రనాథ ఠాగోర్ చిత్రాల్లో కనిపిస్తుంది. ఈయన తన చిత్రాలలో అసలు రూపాన్ని పగులగొట్టి విరూప పరచకుండా, రూపాన్ని రూపంగానే ఉంచి, రూపంపైన వెలుగునీడలను మాత్రమే క్యూబ్‌ల ఆకారంలో చూపుతారు. దీనివల్ల పాశ్చాత్య క్యూబిజంవలె రూప నిర్మాణంలో మార్పులేక కేవలం రూపంపైనున్న వెలుగు నీడల్లోనే మార్పులు గోచరిస్తాయి. సాంకేతికంగా చూస్తే, గగనేంద్రునివి పాశ్చాత్యమైన శుద్ధ క్యూబిస్టు చిత్రాలు కావు. అయినా మరో పేరు లేనందున వాటిని కూడ క్యూబిస్టు చిత్రాలనే అనడం పరిపాటి. లలితకళా అకాడమీవారు బహుశా ఈ కారణంగానే కావచ్చు, గగనేంద్రుని 'సెమీ క్యూబిస్టు' అని వర్ణించారు.

నేడు ప్రపంచమంతా వ్యాపించి వున్న ఆధునిక చిత్రకళకు పునాది ఈ క్యూబిజమే.

---

**"క్యూబిజంతో చిత్రించిన చిత్రం మూడవ కవర్ పేజీలో చూడవచ్చు"**

# తొలి ఆంధ్ర మార్క్సిస్టు పరిశోధకుడు డా॥ కె.బి. కృష్ణ

- ఎం.వి. రామమూర్తి

జనవరి 1994 మిసిమిలో డా॥ కె.బి. కృష్ణపై శ్రీ టి. రవిచంద్ వ్యాసం చదివిన తరువాత కొన్ని విషయాలు చదువరులకు తెలియజెయ్యాలని ఆత్రుత ఎక్కువయింది డా॥ కృష్ణకు ఆంధ్రలో జరిగిన అపచారం, అపకారం యింతంత కాదు. మేధావియైన డా॥ కృష్ణను ఏ విశ్వవిద్యాలయంలోనో ప్రొఫెసరుగా పనిచేయనీయక - కనీసం ప్రయత్నం చేయనీయక - విద్యార్థి మహా సభలలో ఉపన్యసించటానికి, విద్యార్థి సంఘాలలో ప్రసంగించటానికి కమ్యూనిస్టు పార్టీ నియోగించటం మొదటి తప్పు. అతనిని మార్క్సిస్టు మేధావిగా అధ్యయనశీలిగా వుండనీయక జైలుకు వెళ్లవలసిన పరిస్థితి కల్పించటం రెండవది. రష్యాపై హిట్లర్ 1941 జూన్‌లో దండయాత్ర చేయగానే యుద్ధ స్వభావం మారిందని, అది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా మారిందని చెప్పటమే కాక సిద్ధాంత వ్యాసం రాసిన డా॥ కృష్ణను యించుమించుగా జైలులో వెలివేయటం మూడవ తప్పు. జైలునుండి ఆయన విదుదలయిన తరువాతకూడా ఆయనను పట్టించుకోకపోవడం నాలుగవ లోపం. పార్టీ చరిత్రలో అతనికి సముచిత స్థానం యివ్వకపోవటం అయిదవ పొరపాటు ఇంతకూ డా॥ కృష్ణ తెలుగువాడుగా తెలుగునాట రాజకీయ ప్రవేశం చేయటం ఆయనకు అన్ని కష్టనష్టాలు తెచ్చిపెట్టింది

ఈ సందర్భంలో చరిత్రలోని కొన్ని అంశాలు స్ఫురణకు వస్తున్నాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధం 1939 సెప్టెంబరు 3వ తేదీ ప్రారంభమయింది. అపుడు ఛాంబర్లేను బ్రిటీషు ప్రధానమంత్రి. అతడు సంతృప్తీకరణ (Appasement) విధానాన్ని చేపట్టాడు హిట్లర్‌కు పరోక్షంగా సాయపడ్డాడు అతడు హిట్లర్‌పై తుదివరకు పోరాడుతాడనే విశ్వాసం కుదరక అది 'దొంగాటక' యుద్ధం (Phoney War) అన్నాడు ఎం.ఎన్ రాయ్ బ్రిటీషు ప్రజల వత్తిడిపై చర్చిల్ ప్రధానమంత్రి అయినాడు దాంతో యుద్ధ స్వభావం మారిందని, 'ఫాసిస్టు వ్యతిరేక' యుద్ధం అయిందని ఎం.ఎన్ రాయ్ అతని సహచరులు ప్రకటించారు. 1941 జూన్ 21వ తేదీన రష్యాపై దండయాత్ర జరుగగానే ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమని భారతదేశంలో ప్రకటించినవాడు డా॥ కె.బి. కృష్ణ. ఆ నాటికి అంటే 1941 జూన్‌లో ఎం.ఎన్.రాయ్, డా॥ కె బి. కృష్ణ యిరువురూ మార్క్సిస్టు మేధావులే

డా॥ కృష్ణపై 'మెయిన్ స్ట్రీం'' (ఇంగ్లీషు పత్రిక)లో శ్రీ కంభంపాటి సీనియర్ రాసిన వ్యాసాన్ని అనుసరించి 'కమ్యూనిజం' మార్చి 1994 సంచికలో ఒక వ్యాసం ప్రకటితమయింది. అందులోని ముఖ్య విషయాలను పొందుపరుస్తున్నాం. 1) ''కారల్ మార్క్స్ రాసిన పెట్టుబడి గ్రంథాన్ని జైలులో ఆయన ఒక వినూత్నమైన విధానంలో బోధించేవాడు'' (2) ''కానీ జైలులోని మెజారిటీ సభ్యులు కె బి కృష్ణ సిద్ధాంత పత్రాన్ని అంగీకరించలేదు. ఈ చర్చలలో చాలా తీవ్రమైన విభేదాలు పరస్పర వైషమ్యాలు కూడా తలెత్తాయి (కె.బి.కృష్ణ) తాను ఒంటరి వాడినయిపోయినట్లు భావించుకున్నాడు.'' (3) ''మానవాళి సృజించే మేధా సంపద, ఎందుకూ కొరగాకుండా ఎలా నిరర్థకం చేయబడుతుందో చెప్పడానికి కె.బి.కృష్ణను ఒక దృష్టాంతంగా చెప్పవచ్చును.

శ్రీ కంభంపాటి సీనియరు 1980 మెయిన్ స్ట్రీమ్‌లో రాసిన పై అంశాలను సరిగా అర్థం చేసుకోవటం అవసరం. కంభంపాటి సీనియర్ దృష్టిలో యీనాటి భారత కమ్యూనిస్టు పార్టీ దృష్టిలో డా॥ కృష్ణ మార్క్సిస్టు మేధావి. ఆయన మేధా సంపద మానవాళి వినియోగించుకోలేకపోయిందనే వ్యాఖ్య చేసేవారు దానికి కారుకులెవరో స్పష్టంగా చెబితే బాగుండేది. 1948లో మరణించిన డా॥ కృష్ణను గురించి కంభంపాటి ముప్పది సంవత్సరాలు దాటేంతరువాత వ్యాసం రాయడం, ఆయన చనిపోయిన 45 సంవత్సరాల తదనంతరం భారత కమ్యూనిస్టులు తమ సిద్ధాంత పత్రికలో వ్యాసం ప్రకటించడం విడ్డూరంగా కన్పించవచ్చు కాని తరచి చూస్తే విచిత్రం కాదు. కమ్యూనిస్టులు ఎప్పుడూ రైలు తప్పిన ప్రయాణీకులే.

మరొక అంశం రాయవెల్లూరు జైలులో డా॥ కృష్ణయెడల తోటి కమ్యూనిస్టు డెటిన్యూల ప్రవర్తన గురించి రాయకుండా డా॥ కృష్ణ ఒంటరివాడి నయ్యానని క్లేశ పడ్డారనడం దురదృష్టకరం. తోటి డెటిన్యూలు ఆయనను వెలివేస్తేనే ఆయనకు అలాంటి భావం కలిగి వుంటుంది. ఆనాటి కమ్యూనిస్టుల యీ ప్రవర్తన విచిత్రం కాదు. వారి వైఖరే అంత. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమని 1940 జూన్‌లోనే చెప్పిన ఎం ఎన్. రాయ్ అనుచరులతో, సహచరులతో మాట్లాడవద్దని సర్క్యులర్లు జారీ చేశారు ఆనాటి కమ్యూనిస్టులు.

కాలం మారింది భారత కమ్యూనిస్టులు సరళీకృత ఆలోచనా ధోరణిని యీనాడు ప్రదర్శిస్తున్నారు. ఈ మార్పు ముదావహం. కాని డా॥ కృష్ణకు జరిగిన అన్యాయం మటుకు మాసిపోదు.

# ఆధ్యాత్మికత - కామం

- శివలింగం

ఆధ్యాత్మికానందానికి, స్త్రీపురుషుల రత్యానందానికి అభేదాన్ని చూపుతున్నారు ఆధునికులు. రతిలో సాధకుని మనస్సు జాగృతమవుతుందని, కోణార్క్ కామశిల్పాల్లో రతిలో వున్న మిథున వదనాల్లో యోగ సంబంధమైన అంతర్ముఖీనత కనిపిస్తుందని అది తాంత్రికమని వ్యాఖ్యానాలు కూడా వెలయించారు. బౌద్ధ హిందూ తంత్రంలో సెక్సు-యోగ సాధనల ద్వారా రతి సమయంలో వీర్యాన్ని నిరోధించవచ్చని గుహ్యావాదం పేరిట పాశ్చాత్య దేశాల్లో బహుళ ప్రచారం పొందింది. రతి చర్య దివ్యానందంగా, భావాతీతంగా, పరచైతన్యంగా రూపొందింది. కామ శక్తికి ఆనందానికి కీలక సాధనం తంత్రంగా భావించారు. తంత్రం అంటే Sexual awareness and power of life. సెక్సు ద్వారా దివ్యత్వం అనే భావం మధ్య యుగంలో అవతరించింది. భారతదేశంలో ఆధ్యాత్మిక శక్తి నశించి క్షుద్రారాధన పెరిగిన దశలో ఉద్భవించింది కామ మార్మికవాదం. భక్తి పేరిట పచ్చి శృంగార కవిత్వం సృష్టించారు. యోగం భోగంగా మారింది. స్త్రీ పురుషుల కలయికే ఆత్మ, పరబ్రహ్మల కలయికగా, కృష్ణలీలగా భావించారు. సుసంపన్నమైన పవిత్రమైన భారతీయ తాత్వికచింతన వెర్రితలలు వేసింది. పురుషుడు తన ప్రియురాలైన భార్యతో కలసినపుడు ఎలా లోపలా బయటా లేనట్టు భావిస్తాడో అలా జీవత్మ పరమాత్మతో లీనమవుతుంది. అంటే లోపలా బయటా అన్న భావం లేకుండా వుండటం అని బృహదారణ్యకోపనిషత్తు వివరిస్తుంది. స్త్రీ పురుషుల కలయికలో సుఖానుభూతి కలుగుతుంది గాని దివ్యానుభూతి కలుగుతుందనటం అతిశయోక్తి. రతిలో సుఖ సంతోషాలవలన, అలసటవలన విశ్రాంతి పొందటానికి నిద్రలోకి జారిపోవడం జరుగుతుంది. ఇంద్రియానందం అతీంద్రియానందం ఒకటి మాత్రం కాదు. కామకేళిలో ఇంద్రియాలు మూగబోతాయి. వినికిడి శక్తి వుండదు. చైతన్యం మరుగవడం వలన ప్రపంచంతో సంబంధం కోల్పోతాడు. అప్పుడు తెలిసిందల్లా - a few cubic inches of vagina surrounding his penis. తంత్రం సెక్సును అభివృద్ధి చేస్తుందనుకోడం భ్రమ. తంత్రాన్ని cult of ecstacyగా పాశ్చాత్యులు భావించారు. భగవాన్ రజనీష్ పూనేలో ఆశ్రమాన్ని స్థాపించి సెక్సుద్వారా అతీంద్రియానందం పొందవచ్చని ప్రచారం చేశాడు. మానవ చరిత్రలో ప్రథమంగా స్త్రీ పురుషులు సమాగమంలో సమాధి స్థితిని పొందుతారని చెప్పాడు. sex is divine అన్నాడు. రజనీష్ ప్రయోగం ఏ విధంగా విఫలమయిందో తెలిసిందే. ఆల్డస్ హక్స్లీ ఆత్మాతీత దశలను మూడింటిని పేర్కొన్నాడు.

1. ఉన్నత ఆత్మాతీత స్థితి - స్థిత ప్రజ్ఞత్వ లక్షణాలు
2. మధ్యమ ఆత్మాతీత స్థితి - రుజు ప్రవర్తన. సరళరేఖ వంటిది
3. అధమ ఆత్మాతీత స్థితి - కామకేళీ విలాసాల్లో వుంటాడు.

హక్స్లీ అంతర్దృష్టి క్రైస్తవ మతానుభవం మీద ఆధారపడి వుంది. తంత్రంమీద అభిమానం లేదు. ఒనీడా కమ్యూనిటీ సభ్యుల్లో తాంత్రిక భావాలను గమనించాడు. కామానికి ప్రాధాన్యత నిచ్చి కామంద్వారా అతీంద్రియ సాధన విఫలం కావడమేగాక మానసిక వైకల్యం సంభవించే ప్రమాదం కూడా వుంది.

ఆనందం మానసికం. కామం శారీరకం. ఆనందాన్ని మతంలో 'ఉన్మత్తత'గా అభివర్ణించారు. కామానందం అటువంటిదే ననుకున్నారు. కామంలో హింసాత్మక చర్యలు చేయడం ద్వారా పొందేది ఆనందం అని చెప్పుకున్నారు. 'మతానందం' పరవశత్వం లేదా దివ్యోన్మత్తత అని కూడా అన్నారు. కత్తులతో శరీరాన్ని కోసుకోవడం, మండే నిప్పుల్లో నడవడం, ప్రాచీన ఇటలీలో స్త్రీలను కొరడాలతో కొట్టడం, మేకల్ని చంపి శరీరం నిండా రక్తాన్ని పూసుకోడం, ఆఫ్రికాలో యోంబి సంప్రదాయంలో జంతువుల్ని చంపుతున్నప్పుడు కలిగే ఉన్మత్త పరవశత్వంలో ఆడపిల్లలను రేప్ చేయడం, లయబద్ధంగా వాయించే వాద్యాల కనుగుణంగా గంతులువేయడం వంటివి మతోన్మత్త పరవశత కిందికే వస్తాయి.

హిప్పీలు అమెరికాలోను భారతదేశంలో గోవాలోను మత్తు పదార్థాలకు బాగా అలవాటు పడ్డారు. సెక్సులోను, మాదక పదార్థాల సేవనంలోను కలిగేది పరమానందం కాదు. శారీరక ఆనందం. సుఖ దుఃఖాలు కామానికి రెండు పార్శ్వాలు. కామంలో క్రూరత్వం, కసీ కనిపిస్తాయి. జంతువుల్లోనూ కనిపిస్తాయి. భగవంతునిమీద ప్రేమ మహోన్నతమూ, శుద్ధమూ అని క్రైస్తవ మతం. కామాన్ని అధమంగానే చూచాయి అన్ని మతాలు.

స్త్రీని తాకవద్దని, కామంతో దహించుకు పోవడం కంటే వివాహం చేసుకోవడం మంచిదని క్రైస్తవం బోధించింది. జ్ఞానోదయానికి కామం అవరోధమని, కోరికలకు, విషయ వాసనలకు దూరంగా వుండాలని బౌద్ధం. కామమే సంసారానికి మూలమని తెలుసుకోమన్నాడు బుద్ధుడు.

రామకృష్ణుడు (1836-1886) కామినీ కాంచనాల పట్ల జాగ్రత్తగా వుండాలని హెచ్చరించాడు. ఇవి భగవంతునికి మానవునికి మధ్యతెరలు, భార్యాసుఖాన్ని వదలినవాడు ప్రాపంచిక సుఖాలను త్యజించినట్లే. భగవంతుడు అట్టివానికి దగ్గర, కామినీ కాంచనాలు క్షణికాలు. శరీరంలో ఏముందని, సౌందర్యవతిలో వుండేవి ఎముకలు, మాంసము, కొవ్వు. వాటి కోసం భగవంతుడిని మరచిపోతున్నాడు.

జంతు భావన ఎక్కడ ఆగిపోతుందో అక్కడ దివ్యభావన ఆరంభమవుతుంది. జంతు సహజమైన కామ భావం పోయినప్పుడు దివ్యానందాన్ని చవిచూడగలమన్నాడు రామకృష్ణుడు. కామినీ కాంచనాలపట్ల జ్ఞానికి ప్రీతిగాని భీతిగాని వుండదు. రామకృష్ణునికి కామినీ కాంచనాలపట్ల భీతి తొలగలేదు. స్థితప్రజ్ఞత్వ లక్షణాలకు ఈవలే వున్నాడు. భక్తుల ఈశ్వరుడు రసమయుడు. జ్ఞానుల ఈశ్వరుడు తేజోమయుడన్నాడు. భక్తులు ఆడుచు, పాడుచు, నవ్వుచు, ఏడ్చుచూ వుంటారు. కనుక రామకృష్ణుడు భక్తుడు. స్త్రీని ఆరాధించాడు.

అతీంద్రియాన్ని సెక్సుగా పరిగణించడం పాశ్చాత్య దేశాల్లో 20వ శతాబ్దం ప్రథమం (1902)లోనే ప్రారంభం. అనేకమంది స్త్రీలతో సెక్సు ప్రయోగాలు చేసి భగవంతునితో ముఖాముఖీ స్థాయికి చేరుకున్నట్టు ఆలిస్టర్ క్రౌలీ ప్రచారం చేసుకున్నాడు. సిస్టర్ జీనె కూడా భగవంతుని ముద్దును స్వీకరించిందన్నారు. తరవాత క్రౌలీ కామతంత్రాలన్నీ మోసాలని అంతర్జాతీయ మోసగాడని చెడ్డపేరు తెచ్చుకున్నాడు.

LSD వంటి మాదక పదార్థం దివ్యత్వాన్ని కనుక్కోడానికి సహకరిస్తుందనడం సామాజికంగా ప్రమాదకరం. మత్తు అనుభవం ప్రధానంగా సెక్సు అనుభవమేనని అమెరికా మాదక ద్రవ్యాల గురువు టిమోతి లియరీ పేర్కొన్నాడు. మాదక ద్రవ్యాల సేవనం కామోద్దీపన చేయడమేకాదు, కామాన్ని చంపుతుంది కూడా. LSD సేవించిన ఒక అమ్మాయి వీధిలో బట్టలూడదీసి పడుకుని కాళ్లు పైకెత్తి భగవంతుడిని రతి జరపమని కేకలు పెడుతూ

పిలిచిందట. లాస్ ఏంజల్సులో హిప్పీ సెంటర్సులో పరిశోధనలు జరిపితే సైకాడిలిక్ డ్రగ్సువలన కామంతోపాటు సుఖవ్యాధులు కూడా బాగా పెరిగినట్టు కనుగొన్నారు. పబ్లిక్ ముద్దులు ఎక్కువైనాయి. ఎన్‌కౌంటరు థిరపీ కూడా సెక్సు అవరోధాలను తొలగించి ఆధ్యాత్మిక వికాసాన్ని కలిగిస్తుందని ప్రచారం చేయడమేగాని ఏదీ జరగలేదు. భౌతిక సుఖాలు క్షణికాలు. అవిచల విశాల శాంతి కలగాలి. జ్ఞానదీపం నిలిచి వెలగాలి. సెక్సులో గాఢమైన ఇంద్రియానందం తప్ప మరొకటి లభించదు.

ఒక యువకుడితో స్వలింగ సంపర్కం వున్నా ఆధ్యాత్మిక జీవితం గడపవచ్చా అని ఇషర్‌వుడ్ అడిగాడట ప్రభవానందను.

'నీవు వాడిలో చిన్న కృష్ణుడిని చూడటానికి ప్రయత్నించు' అన్నాడట ప్రభవానంద.

ఈ సలహా మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది.

W.B యేట్స్ కూడా సెక్సు ప్రేమకు, మార్మిక దర్శనకు భేదం లేదని తప్పుగా అర్థం చేసుకున్నాడు. అవసానదశలో 1929లో తన తప్పును తెలుసుకున్నాడు. పశ్చాత్తాపం చెందాడు. 'I shall be a sinful man to the end and think upon my deathbed of all the nights. I wasted in my youth'.

కామతంత్రం అతిప్రాచీన కాలంనుంచి వున్నట్టు లోకాయత గ్రంథంలో సాంఖ్య, తంత్ర ప్రకరణాల్లో గుర్తించవచ్చు. మనసు అతీంద్రియ సత్తవైపు తిరిగితే భక్తి. ఇంద్రియాలవైపు తిరిగితే కామం. ఈ విషయం తెలియక భక్తకవులు స్త్రీ పురుషుల కలయిక ఆత్మ పరమాత్మలుగా భావించుకుని కామకేళీ వర్ణనలతో గుప్పించారు. జయదేవుని గీతగోవిందంతో విజృంభించారు కవులు.

అతీంద్రియానుభూతి పొందనివారు వైరాగ్య శతకం వ్రాస్తే ఎలావుంటుందో భర్తృహరిని చూస్తే తెలుస్తుంది. అందుకే కోశాంబి విమర్శించాడు. చలంగారు సుధలో 'నఖక్షతాలు' పదం ఆధ్యాత్మిక కవిత్వంలో ప్రయోగించడంవలన తప్పు పట్టాడు రా.రా.

ఆధ్యాత్మిక సాధనలో మనసు అతీంద్రియసత్తవైపు పయనిస్తున్న కొద్దీ లైంగిక విషయాసక్తి తగ్గిపోతూ ఒక దశలో ఆగిపోతుంది. అతీంద్రియ సత్తను దర్శించడంతో లింగభేదం వుండదు. స్థితప్రజ్ఞుడుగా రూపొందే స్థితి. ఏ కోణం చూచినా కామం ఆధ్యాత్మిక వికాసానికి దోహదకారి కాదు. కామిగాని మోక్షగామి కాదు. అంటే మానవుడికి అన్నీ వుండాలి. ఏది లేకపోయినా లోపమే. భౌతికంగా పరిపూర్ణుడే ఆధ్యాత్మిక పరిపూర్ణతను సాధించగలుగుతాడు. కామంద్వారా ఇంద్రియ ప్రకోపోపశమనం. అన్ని ఇంద్రియ ద్వారాలు తెరవాలి. సాధన ద్వారా మనసును ఊర్ధ్వముఖంగా పయనింపచేస్తేనే భౌతిక బంధనలు తొలగిపోతాయి.

వేద వేదాంగాలు చదివిన ఘనాపాఠి ఒకడు ఒక గురువుగారితో యోనిపూజ చేశానన్నాడట.

'ఛీ! నీ ముఖం చూడకూడదు పొమ్మన్నా'డట గరువుగారు.

ఆధ్యాత్మికత కామానికి చుక్కెదురు కాదు. అది ఇది కాదు. కామాన్ని అధిగమించాలి.

# భారతీయ దర్శనాలు పరిచయం

– బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

భారతీయ దర్శన శాస్త్రాన్ని గురించి పాశ్చాత్యులకు బోధించడం కోసం ఇంగ్లీషు భాషలో 'ఇండియన్ ఫిలాసఫీ' అనే ఉద్గ్రంథం రచించిన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ అన్నట్టు - భారతీయ దర్శనాలను గూర్చి వివరించడానికి పూనుకోడంలో చాలా చిక్కులు ఉన్నాయి. మొదటిది : మన దార్శనికు లెవ్వరి తేదీలూ మనకు స్పష్టంగా తెలియవు. రెండోది : వారు ఏ రూపంలో తమ దార్శనిక గ్రంథాలు రచించారో ఆ రూపంలోనే - అటు తర్వాతి కాలంలో ఎలాంటి ప్రక్షిప్తాలూ (చేర్పులూ) లేకుండా - యథాతథంగా అవి మనదాకా వచ్చా యనే హామీ ఏమీ లేదు. కొన్ని సందర్భాలలో కొందరు దార్శనికులు చారిత్రక వ్యక్తులు అవునా కాదా అనే సందేహాలు కూడా ఉన్నాయి. ఎన్నో దార్శనిక గ్రంథాలు వినష్టం అయిపోయాయి. ఇతర దార్శనిక గ్రంథాలలో చేసిన ప్రస్తావనలే వాటిని గూర్చి తెలుసుకోడానికి మనకు ఆధారం. ఇలాంటి పరిస్థితులలో మన దర్శన చరిత్ర రచయితలలో అభిప్రాయ భేదాలు ఎక్కువగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. సూక్ష్మమైన అలాంటి అభిప్రాయాల భేదాల జోలికి పోకుండా స్థూలంగా మన వివిధ దర్శనాలను గూర్చి ఎక్కువమంది అంగీకరించే అంశాలను మాత్రమే సామాన్య పాఠకునికి అర్థం అయ్యే తీరులో వివరించడమే ఈ వ్యాస పరంపర లక్ష్యం.

## 'దర్శన' పద నిర్వచనం :

'దృశ్యతే అనేన' (దర్శించడానికి తోడ్పడేది) అని 'దర్శన' శబ్ద వ్యుత్పత్తి. మన దర్శన కర్తల అభిప్రాయానుసారం దర్శించవలసినవి సుఖ దుఃఖాలు, ధర్మాధర్మాలు, పాప పుణ్యాలు, ఆత్మతత్త్వం, జగత్తత్త్వం మొదలైనవి. దర్శించేవాడు పురుషుడు. 'పురి' - శరీరం అనే పురంలో, 'శేతే' - శయనించి ఉండేవాడు పురుషుడు. స్థావర (వృక్షాదులు), జంగమాది (పశు పక్ష్యాది) శరీరా లన్నిటిలోనూ ఉండే చైతన్యమే పురుషుడు. ఈ పురుషుడు తన ఇంద్రియాల ద్వారా, మనస్సు ద్వారా ఎలా జ్ఞానం పొందుతున్నాడో, అలా పొందిన జ్ఞానంలో ఏది పారమార్థిక జ్ఞానమో, ఏది ఆభాసా మాత్రమైందో (అంటే పైకి నిజంలాగ కనిపిస్తూ, నిజానికి అవాస్తవమైందో) యుక్తిద్వారా, తర్కం ద్వారా చర్చించి నిర్ణయాలు చేసేది దర్శనం. ఇంగ్లీషులో 'ఫిలాసఫీ' అనే పదానికి పర్యాయ పదంగా 'దర్శన' పదాన్ని నేటి దార్శనిక విద్వాంసులు వాడుతున్నారు.

## ఆన్వీక్షికి :

'దర్శన' శబ్దం క్రీ.పూ. 1వ శతాబ్దంలో వాడుకలోకి వచ్చిందనీ, అంతకుముందు ఈ అర్థంలో 'ఆన్వీక్షికి' అనే పదం వాడుకలో ఉండేదనీ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ తెలియజేస్తున్నారు. క్రీ.పూ. 6వ శతాబ్ది నాటికి ఆన్వీక్షికి ప్రాధాన్యంలోకి వచ్చింది. ఆ రోజులలో నాలుగే ప్రధానమైన విద్యలు : త్రయీ (వేదాలు), వార్తా, దండనీతి, ఆన్వీక్షికి. కౌటిల్యుడు (క్రీ.పూ. 300 ప్రాంతం వాడు) తన అర్థశాస్త్రంలో తక్కిన మూడు విద్యలకంటె ఆన్వీక్షికి విశిష్టమైందని పేర్కొన్నాడు. 'ఆన్వీక్షికి' అన్వేషణ శాస్త్రం. సందేహంతో జిజ్ఞాస ప్రారంభమవుతుంది. ఆ జిజ్ఞాసకు ఫలితంగా సత్య దర్శనం కలుగుతుంది.

అయితే, రామాయణంలో 'ఆన్వీక్షికి' ఈ క్రింది విధంగా నిరసించబడింది :

ధర్మశాస్త్రేషు ముఖ్యేషు - విద్యమానేషు దుర్బుధాః।
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య - నిరర్థం ప్రవదంతి తే॥

(అయో. 100-39)

(ధర్మశాస్త్రాలు ధర్మాధర్మాలను నిర్ణయిస్తూ ప్రాధాన్యం వహించి ఉండగా, కొందరు దుర్మేధావులు 'ఆన్వీక్షికి' విద్యను ఆశ్రయించి ఆ ధర్మాలు నిరర్థకాలని వాదిస్తున్నారు).

మనువు కూడా ఒక చోట ''కొందరు విద్వాంసులు 'హేతుశాస్త్రం'తో వేదాలనూ, ధర్మశాస్త్రాలనూ నిరసిస్తూ సంఘ బహిష్కరణార్హు లవుతున్నారు'' (మనుస్మృతి 2-11) అన్నాడు. అయితే మనువు, గౌతముడు కూడా తమ ధర్మశాస్త్రాలలో క్షత్రియులు 'ఆన్వీక్షికి'ని అవశ్యం అధ్యయనం చెయ్యాలి అని ఆదేశించారు. సచివ మండలుల సభ్యులలో 'ఆన్వీక్షికీ' విద్వాంసులను కూడా చేర్చారు. 'ఆన్వీక్షికి' సహాయంతోనే తాను వేద విభజన చేసినట్లు వ్యాసుడు చెప్పుకొన్నాడు.

## విశ్వాసం - తార్కికదృష్టి :

బౌద్ధయుగంలోనే భారతదేశంలో మొట్టమొదటిసారిగా దార్శనిక ప్రవృత్తి ఆరంభమైందని నేడు దార్శనిక విద్వాంసు లందరూ అంగీకరిస్తున్నారు. అంతకు ముందు తపస్వులైన ఋషులు ఆవిష్టస్థితిలో సమ్యగ్దర్శనం ద్వారా దర్శించి గానం చేసిన ఋక్కులు, లేక మంత్రాలు అనబడే కవితా రూపమైన రచనలే ప్రాబల్యం వహించి ఉండేవి. ఆ యుగంలో తర్క వివేచనకంటె విశ్వాసానికి అధిక ప్రాముఖ్యం ఉండేది.

మొట్టమొదటి సారిగా బౌద్ధ, జైన దర్శనాలే భారతదేశంలోని 'విశ్వాస' ప్రవృత్తిని ఎదిరించి స్వతంత్రంగా తార్కికంగా చింతనచేసి తమకు తాముగా తత్త్వాన్ని దర్శించడానికీ, సత్యాన్ని ప్రకటించడానికీ పూనుకొన్నాయి. బౌద్ధ దర్శనానికి ప్రధానమైన అస్త్రం 'తర్కం'. బౌద్ధ దార్శనికులు మన తర్కశాస్త్రాన్ని ప్రపంచంలోనే అత్యున్నత స్థాయికి అభివృద్ధి పరిచారు.

## దర్శనాలు - సూత్ర రచన :

అంతకు పూర్వం వైదిక యుగంలోని వేదాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు మొదలైన మతగ్రంథాలు అత్యంత విపులంగా ఉండి, చర్చలలో ఉదాహరించడానికి అనుకూలంగా లేకపోవడంతో దార్శనిక యుగంలో రచయితలు తమ దార్శనిక గ్రంథాలను సంక్షిప్తంగా చర్చలలో సులువుగా ఉదాహరించడానికి వీలుగా సూత్రాల రూపంలో రచించడానికి పూనుకున్నారు. అందుచేత ఈ దార్శనిక యుగాన్ని సూత్రరచనా యుగం అని కూడా అనడం కద్దు. సూత్రాన్ని ఇలా నిర్వచించారు :

అల్పాక్షర మసందిగ్ధం - సారవద్ విశ్వతోముఖమ్
అస్తోభ్య మనవద్యం చ - సూత్రం సూత్రవిదో విదుః

**సూత్రం ఈ క్రింది ఆరు లక్షణాలను కలిగి ఉండాలి :**

1. అది 'అల్పాక్షరం' అయి ఉండాలి. అంటే సాధ్యమైనన్ని తక్కువ అక్షరాలలో సాధ్యమైనంత ఎక్కువ అర్థాన్ని సూత్రం చెప్పాలి. సూత్రంలో ఒక్క 'మాత్ర' (హ్రస్వం) తగ్గించగలిగితే వైయాకరణులు (వ్యాకరణ శాస్త్రవేత్తలు) పుత్రుడు కలిగినంత సంతోషం పొందుతారట!

2. సూత్రం 'అసందిగ్ధం'గా ఉండాలి. అంటే ఎలాంటి సందేహానికీ తావీయకూడదు. తాను ఎంత అర్థాన్ని చెప్పదలచుకున్నాడో అన్యూనాతిరిక్తంగా (ఎక్కువ, తక్కువ కాకుండా) అంత అర్థాన్నే సూత్రంలో చెప్పాలి.

3. 'సారవత్' - సూత్రం సారాంశాన్ని మాత్రమే చెప్పాలి. దాని విపులీకరణ, వివరణ వ్యాఖ్యాతల వంతు.

4. 'విశ్వతోముఖమ్' ఆ సూత్రంలో చెప్పబడిన అన్ని సందర్భాలకూ ఆ సూత్రం అన్వయించాలి.

5. 'అస్తోభ్యం' - తలయెత్తే వివిధ సందేహాలకు సూత్రం సమాధానం చెప్పగలిగి ఉండాలి. మధ్యలో ఎక్కడా అవరోధం ఏర్పడకూడదు.

6. 'అనవద్యం' - సూత్రం దోషరహితమై ఉండాలి. పూర్వపక్షి (తమవాదాన్ని సవాలు చేసే ప్రతిపక్షి) సూత్రంలో ఎలాంటి దోషాన్నీ చూపించేందుకు అవకాశం ఉండకూడదు.

## దర్శన వికాస దశలు :

ప్రతి దర్శన పరిణామంలోనూ దార్శనిక చరిత్ర రచయితలు మూడు దశలను గుర్తించారు.

**1. దర్శన పూర్వదశ :-** ఒక దర్శనాన్ని దార్శనికుడు సూత్రగ్రథితం చేయడానికి ముందు ఎన్నో తరాల పాటు ఆ దర్శనంలోని భావాలను విద్వాంసులు తీవ్రంగా చర్చిస్తూ వాటికి ఒక విస్పష్ట రూపకల్పన చేస్తారు. ఇది దర్శన పూర్వదశ.

**2. రచనా దశ :-** అలా దర్శనంలోని వివిధ భావాలకు చర్చలలో ఒక విస్పష్ట రూపం ఏర్పడిన తరువాత ఒక దార్శనికుడు ఆ భావాలకు సూత్ర రూపం ఇచ్చి దర్శన గ్రంథం రచిస్తాడు. ఇది దర్శన రచనా దశ.

**3. వ్యాఖ్యాన దశ :-** అనంతర కాలంలో ఆ సూత్రాల అర్థాలను వివరిస్తూ అనేక వ్యాఖ్యానాలూ, ఆ వ్యాఖ్యానాల మీద వ్యాఖ్యానాలూ వెలువడుతాయి. ఈ వ్యాఖ్యానాలలో మూల సూత్రాలలోని అర్థాలను విపులీకరించడం, మార్పులు, చేర్పులు చేయడం కూడా జరిగినా, వ్యాఖ్యాతలు మిక్కిలి వినయంతో కేవలం తాము ఆ దార్శనికుని అనుయాయులం మాత్రమే అని ప్రకటించుకుంటారు. మూల దర్శనకర్త పేరుతోనే ఆ దర్శనం వ్యవహరించబడుతుంది.

వ్యాఖ్యానాలు చర్చల రూపంలో సాగుతాయి. పూర్వపక్షి సూత్రాలలోని అంశాలను సవాలు చేస్తూ ఎన్నెన్నో అభ్యంతరాలు లేవదీస్తూ ఉంటాడు. సిద్ధాంతకర్త అయిన వ్యాఖ్యాత ఆ అభ్యంతరాల కన్నిటికీ తగిన జవాబులు చెప్పి, సూత్ర తాత్పర్యాన్ని సిద్ధాంతీకరిస్తాడు.

మాక్స్ ముల్లర్ అభిప్రాయం ప్రకారం బుద్ధుడు మొదలు అశోకుని వరకు సూత్ర రచనాయుగం సాగింది. అయితే వేదాంత, సాంఖ్య, యోగ దర్శనాలు అంతకు పూర్వమే అభివృద్ధి చెంది ఉండాలి అని ఆయన భావిస్తున్నాడు.

## పారిభాషిక పదాలు :

'దర్శనం' శాస్త్రం గమక దీనిలో 'ఇంద్రియాలు', 'పంచతన్మాత్రలు', 'చిత్తం', 'బుద్ధి', 'అహంకారం', 'మహత్', 'పారిమాండల్యం', 'ప్రకృతి', 'పురుషుడు', 'అవిద్య', 'మాయ', 'ప్రత్యక్షం', 'అనుమానం' వంటి ఎన్నో పారిభాషిక పదాల వాడుక తప్పనిసరి అవుతుంది.

అయితే - సాధ్యమైనంత వరకు మరీ క్లిష్టమైన పారిభాషిక పదాల వాడుక తగ్గించి, సామాన్య పాఠకులకు కూడా అర్థం అయ్యే తీరులో ఈ వ్యాస పరంపరలో రచన సాగుతుంది. కాని, తప్పనిసరిగా పారిభాషిక పదాలు వాడవలసి వస్తే మొదటిసారిగా ఆ పదాలను వాడిన సందర్భంలో అధస్సూచికలో వాటిని నిర్వచించడం జరుగుతుంది.

## దర్శనాలు ఎన్ని?

'దర్శనాలు ఎన్ని'? 'షడ్ దర్శనాలు ఏవి'? మొదలైన ఎన్నో ప్రశ్నల విషయంలో దర్శన చరిత్ర రచయితల మధ్య అభిప్రాయ భేదాలు ఉన్నాయి.

మొట్ట మొదటి 'భారతీయ దర్శన చరిత్ర' రచయిత మాధవాచార్యుడు (విద్యారణ్య స్వామి - 14వ శతాబ్ది) తాను రచించిన 'సర్వ దర్శన సంగ్రహం'లో మొత్తం 16 దర్శనాలను పేర్కొన్నాడు.

దర్శనాలలో కొన్ని ఆస్తిక దర్శనాలు, మరికొన్ని నాస్తిక దర్శనాలు. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించే దర్శనాలను 'ఆస్తిక' దర్శనాలనీ, అలా అంగీకరించని వాటిని 'నాస్తిక' దర్శనాలనీ వ్యవహరిస్తున్నారు. దర్శనాలలో మరొక విభాగం: 'సేశ్వర' (దేవుడున్నా డని అంగీకరించే) దర్శనాలు, 'నిరీశ్వర' (దేవుడు లేడని వాదించే) దర్శనాలు అని.

దార్శనిక యుగ ప్రారంభంలో కొన్ని శతాబ్దాలపాటు నాస్తిక, నిరీశ్వర దర్శనాలే భారత దేశంలో ప్రాబల్యం వహించాయి. వాటిలో ముఖ్యమైనవి: 1. చార్వాక (లోకాయత) దర్శనం, 2. జైన (అర్హత) దర్శనం, 3. బౌద్ధ దర్శనం.

కొన్ని చారిత్రక కారణాలవల్ల నాస్తిక, నిరీశ్వర దర్శనాల ప్రాబల్యం తగ్గి, క్రమంగా వేద ప్రామాణ్యాన్ని అంగీకరించే ఈ క్రింది ఆరు ఆస్తిక దర్శనాలే షడ్ దర్శనాలుగా ప్రసిద్ధి పొందాయి.

| దర్శనం | | దర్శనకర్త |
|---|---|---|
| 1. న్యాయ దర్శనం | - | గౌతముడు |
| 2. వైశేషిక దర్శనం | - | కణాదుడు |
| 3. సాంఖ్య దర్శనం | - | కపిలుడు |
| 4. యోగ దర్శనం | - | పతంజలి |
| 5. పూర్వ మీమాంసా దర్శనం | - | జైమిని |
| 6. ఉత్తర మీమాంసా దర్శనం | - | వ్యాసుడు |

ఈ ఆరే ఈ నాడు షడ్ దర్శనాలుగా ప్రసిద్ధి చెందినా, ఒకప్పుడు ఈ పరిగణన ఇందుకు భిన్నంగా ఉన్నట్లు కనిపిస్తూంది. హరిభద్రసూరి మతానుసారం 1. బౌద్ధం, 2. న్యాయం, 3. సాంఖ్యం, 4. జైనం, 5. వైశేషికం, 6. పూర్వ మీమాంస అనే ఆరే షడ్ దర్శనాలుగా ఒకప్పుడు భావింపబడుతూ వచ్చినట్లు శ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు* తెలియజేస్తున్నారు.

అయితే ఈ వ్యాసం పరంపరలో పైన పేర్కొన్న మూడు నాస్తిక, నిరీశ్వర దర్శనాలను, నేడు షడ్ దర్శనాలుగా ప్రసిద్ధి పొందిన ఆరు ఆస్తిక దర్శనాలను మాత్రమే వివరించే ప్రయత్నం జరుగుతుంది.

* చూ. 'దర్శన కర్తలు - దర్శనములు' (పుట-8), 1985, 33 కిర్లంపూడి క్వార్టర్స్, వాల్తేరు-3.

# బి.సి.లను గుర్తించే విధానాలేవి?

ఆంగ్ల మూలం : ఆర్.పి.సింగ్, ఐ.ఏ.ఎస్.

సాంఘికంగానూ, విద్యా విషయికంగానూ వెనుకబడిన తనాన్ని గుర్తించడానికి కొన్ని సూత్రాలు రూపొందింపవలసి ఉన్న వెనుక బడిన తరగతుల కమీషన్ వారి పని ఏమంత సులభసాధ్య మైంది కాదు. వారు తయారు చేసే సూత్రాలు ప్రస్తుత సంఘ వ్యవస్థకు నిష్పక్షపాతంగా వర్తించేందుకు వీలుగా ఉండాలి. ఏ మాత్రం పక్షపాత దృష్టి కనిపించినా ప్రజలలో గగ్గోలు పుట్టడం సంగతి అలా ఉంచి, కమీషన్ వారి సిఫార్సులను కోర్టులలో సవాలు చేసే ప్రమాదం ఉంది.

## మండల్ కమీషన్ రిపోర్టు :

మండల్ కమీషన్‌వారు కులాల వారీ రిజర్వేషన్‌లు న్యాయసమ్మతం అవునా, కాదా అనే విషయాన్ని గురించీ, దానికి సంబంధించిన చట్టపరమైన, రాజ్యాంగ సంబంధమైన అంశాలను గురించీ చర్చిండానికి తమ నివేదికలో అధికభాగం వినియోగించారు. అయితే సాంఘికంగానూ, విద్యావిషయికంగానూ వెనుకబడినతనాన్ని గుర్తించే విషయంలో మండల్ కమీషన్‌వారు వస్తుగతమైన దృష్టిని ప్రదర్శించకుండా, పూర్తిగా 'మొక్కుబడి' ధోరణిని అవలంబించారు. సాంఘికంగానూ, విద్యావిషయకంగానూ, ఆర్థికంగానూ వెనుకబడినతనాన్ని నిర్ణయించేందుకు పదకొండు సూచికలకు మండల్ కమీషన్ తయారు చేసింది. ఆ సూచికలను వేర్వేరు మూల్యాలు కల్పించింది. ఆ సూచికలను దృష్టిలో ఉంచుకొని ఒక ప్రశ్నావళిని తయారుచేసి దేశంలోని ప్రతి జిల్లాలోనూ రెండేసి గ్రామాలనూ, ఒక పట్టణ ప్రాంతాన్నీ ఎంచుకొని అక్కడ ఆ ప్రశ్నావళికి జవాబులు సేకరించారు. దేశంలోని ప్రతి తరగతి విషయంలోనూ అర్థవంతమైన నిర్ణయాలు చేసేందుకు ఈ సర్వే సరిపోదు అనడం స్పష్టం. నిజానికి ఈ సర్వేలో చాలా తరగతుల వారిని అసలు కలుసుకోడమే జరుగలేదు. జిల్లాలో రెండు గ్రామాలలో ఎక్కువ తరగతులవారు నివసించడం జరుగకపోవచ్చును. ఏది ఏమైనా అటువంటి చిన్న నమూనా సర్వే వల్ల తయారుచేసే సాధారణ సూత్రాలు చెల్లదగినవి కావు.

మండల్ కమీషన్ రిపోర్టులో ఆ కమీషన్‌వారే స్వయంగా ఇలా పేర్కొన్నారు : ''సాంఘికంగా, విద్యా విషయికంగా వెనుకబడినతనాన్ని నిర్ణయించేందుకు కొన్ని సూత్రాలు తయారు చేసి వాటిని పరీక్షించడానికి అవసరమైన భోగట్టాను సమకూర్చడంలో మా శాంపిల్ సర్వే తగినంత పెద్దదే అయినా, దేశంలోని ప్రతి కులాన్నీ, తరగతినీ పరామర్శించేందుకు తగినంత విశాలమైన సర్వే కాదు మాది. మాకు ఇచ్చిన ఆదేశాలలో ప్రతి రాష్ట్రంలోనూ సాంఘికంగానూ, విద్యా విషయికంగానూ వెనుకబడి ఉన్న తరగతులవారి పూర్తి జాబితాను తయారు చేయడం కూడా ఒకటి. సక్రమ రీతిలో 'ఓ.బి.సి.'లను (ఇతర వెనుకబడిన తరగతుల వారిని) గుర్తించడానికి అవకాశం లేకపోతే, ఈ కమీషన్ సిఫార్సులకు కేవలం పరిశోధన విలువ తప్ప మరేవిధమైన విలువ ఉండదు.''

మండల్ కమీషన్‌వారు పైవిధంగా వెనుకబడినతనాన్ని గూర్చి జరిపిన సర్వే ఫలితాలను ఏ తరగతుల వారికి సంబంధించిన వాటినీ తమ నివేదికలో పొందుపరచలేదు. కమీషన్‌వారు తమ

నివేదికకు అనుబంధంగా రాష్ట్రాల వారీగా ఇచ్చిన వెనుకబడిన తరగతుల జాబితాలకు ఆధారం ''తాము దేశంలో విస్తృతంగా పర్యటించి ప్రజలనుండి సేకరించిన సాక్ష్యాలవలన తాము సంపాదించిన ప్రత్యక్ష జ్ఞానం'' అని పేర్కొన్నారు. (రిపోర్టు పదవ అధ్యాయంలో విపులంగా ఆ సాక్ష్యాలన్నీ చేర్చబడ్డాయి.).

రిపోర్టులోని పదవ అధ్యాయంలోగాని, మరొకచోట గాని ఒకానొక కులాన్ని ఆ జాబితాలో ఏ అర్హతను బట్టి చేర్చారో ఎక్కడా వివరించబడలేదు. రాష్ట్రాలవారీ జాబితా తయారుచేయడంలో ఎన్నో దారుణమైన పొరపాట్లు జరిగాయి. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ జాబితాలో మూడు ప్రధానమైన బ్రాహ్మణ వర్గాలను - వైదికులను, నియోగులను, అర్చకులను - చేర్చడమేగాక, రాజకీయంగానూ, ఆర్థికంగానూ మిక్కిలి అభివృద్ధి సాధించిన రెడ్డి, కమ్మ కులాలను కూడా ఆ జాబితాలో చేర్చారు. అదే విధంగా కర్నాటక రాష్ట్ర జాబితాలో వొక్కలిగ, లింగాయత్ మొదలైన కులాలు వెనుకబడిన జాతులుగా పేర్కొనబడ్డాయి. ఉత్తరహిందూ దేశంలోని ప్రసిద్ధమైన రైతు జాతివారైన 'జాట్'లను ఉత్తరప్రదేశ్ రాష్ట్ర వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చడం జరుగలేదు. పైగా యమునా నది ఆవతల పంజాబ్, హర్యానా రాష్ట్రాలలో అంతకంటె ఎంతో అభివృద్ధిలో ఉన్న వారి సోదరులను మండల్ జాబితా వెనుకబడిన వర్గాలలో చేర్చింది. నిజానికి పంజాబ్‌లోని సిక్కు జాట్‌లు ఉత్తర ప్రదేశ్‌లోని జాట్‌లకంటె ఒకతరం ముందు ఉన్నారు.

వెనుకబడిన కులాలను/జాతులను గుర్తించడం వంటి ముఖ్యమైన విషయంలో దారుణమైన లోపాలు జరగడం వలన మండల్ కమీషన్ రిపోర్టు విషయంలో అనేక తీవ్రమైన సందేహాలు తల ఎత్తుతున్నాయి. ఆ కమీషన్‌లో ఆర్థికంగా అభివృద్ధి సాధించిన తరగతుల సభ్యులు ఎక్కువగా ఉండడం వలన ఆ కమీషన్‌లో ఉన్న ఒకే ఒక షెడ్యూల్డ్ కులం సభ్యుడు శ్రీ ఎల్.ఆర్. నాయక్ ఆ కమీషన్ రిపోర్టుకు ఒక అసమ్మతి నోట్ చేర్చడమే కాక, 'దీనులైన వెనుక బడిన తరగతుల వారి' జాబితా అని తన నోట్‌కి అనుబంధంగా ఒక జాబితాను ఈయవలసి వచ్చింది (చూ. అనుబంధం 2 - సంపుటి 7).

మండల్ కమీషన్‌వారు వెనుకబడిన తరగతులను గుర్తించడానికి కొన్ని సూత్రాలను మాత్రం రూపొందించి, ఏ రాష్ట్రంలో ఏ ఏ జాతులు వెనుకబడినవో గుర్తిస్తూ జాబితాలు తయారు చేసే పనిని రాష్ట్ర కమీషన్‌లకుగాని, రాష్ట్ర ప్రభుత్వం నియమించే ఇతర సంస్థలకుగాని వదలి ఉంటే బాగుండేది. 'ప్రత్యక్ష పరిజ్ఞానం' ఆధారంగా తయారు చేశామని చెబుతూ ఆదరాబాదరాగా అలాంటి జాబితాలను ప్రకటించడం కంటె కమీషన్‌వారు నిష్పాక్షికంగానూ, కచ్చితమైన జనాభా లెక్కలు ఆధారంగానూ మరింత సమగ్రమైన సర్వేను జరిపి ఉంటే బాగుండేది.

## కచ్చితమైన జనాభా లెక్కల లోపం :

వెనుకబడిన తరగతుల విషయమై నియమించబడిన వెనుకడి కమీషన్‌లను చిక్కులలో పెట్టిన మరొక అంశం వెనుకబడిన తరగతులవారి కచ్చితమైన జనాభా లెక్కలను సంపాదించడం. నిజానికి 'మురళీధర రావు కమీషన్' సిఫార్సులను హైకోర్టు రద్దు చేయడానికి గల ప్రధాన కారణం ఆ కమీషన్ ఇచ్చిన వెనుకబడిన తరగతుల జనాభా అంచనాలు నిరాధారాలు కావడం, అనేక దోషాలతో కూడి ఉండడం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విషయంలో వెనుకబడిన తరగతులవారు అనేక వర్గాలుగా విభజింప బడడం ప్రతివర్గానికీ ప్రత్యేకమైన రిజర్వేషన్ సౌకర్యాలను కల్పించడం జరిగినందువలన ప్రతి వెనుకబడిన తరగతి జనాభా సంఖ్యను కచ్చితంగా నిర్ణయించడం మరింత అవసరం అవుతూంది. దురదృష్టవశాత్తు ఈ నాడు ఈ విషయమై ప్రాథమికమైన భోగట్టా లభించడం లేదు. బ్రిటిష్ ఇండియాలో లాగ పదేళ్లకు ఒకసారి సేకరించే జనాభా లెక్కలలో కులాల వారీ భోగట్టా కూడా సేకరించి ఉంటే ప్రతి తరగతి వారి జనాభా సంఖ్యలనూ తెలుపడానికే కాక, వివిధ వర్గాల వారికి

సంబంధించిన సాంఘిక, ఆర్థిక పరిస్థితులను పట్టికలుగా తయారు చేయడానికి కూడా వీలై ఉండేది. దానివలన వెనుకబడినతనాన్ని గుర్తించే సమస్యే కాకుండా, వివిధ తరగతుల సంఖ్యా బలాన్ని తెలుసుకునే సమస్య కూడా పరిష్కారమై ఉండేది.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జనాభా లెక్కల సేకరణకు సంబంధించిన ప్రశ్నావళి నుంచి కులం ప్రస్తావనను తొలగించారు. ఒక్క ఎస్.సి.లు, ఎస్.టి.ల విషయంలో తప్ప ప్రస్తుత జనాభా లెక్కల వలన కులాల భోగట్టా ఏ మాత్రం మనకు తెలియడం లేదు. 1941 జనాభా లెక్కల సేకరణలో కులాల భోగట్టాను కూడా సేకరించినా, రెండవ ప్రపంచ సంగ్రామం దృష్ట్యా ఆ వివరాల పట్టికలు తయారుచేయడం జరుగకపోవడం, తత్ఫలితంగా కులాల వారీ భోగట్టా మనకు లభించక పోవడం జరిగింది. 1931 జనాభా లెక్కలలో కూడా మద్రాసు రాజధానికి సంబంధించినంత వరకు కొన్ని ప్రత్యేక కులాలకు సంబంధించిన భోగట్టాను మాత్రమే ప్రకటించారు. నేడు వివిధ కులాలకు సంబంధించి ప్రకటిస్తున్న జనాభా లెక్కల అంచనాలు 1921, 1931 జనాభా లెక్కలు ఆధారంగా తయారైనవే!

1931 జనాభా లెక్కలను గాని, అంతకు ముందు సేకరించిన జనాభా లెక్కలను గాని ఉపయోగించుకునే ముందు వాటికి గల అనేక పరిమితులను మనం పరిగణనలోకి తీసుకోవాలి. ప్రస్తుతం ఉన్న రాష్ట్రాల సరిహద్దుల దృష్ట్యా ఆ భోగట్టాను విభజించుకోవలసిన అవసరం, వివిధ వర్గాల జనాభా ఒకే రేటు ప్రకారం అభివృద్ధి చెందుతూంది అని భావించుకోవలసి రావడం అనే చిక్కులు అలా ఉండగా, వివిధ కులాలవారు తమ పేర్లను మార్చుకోడంవలన కూడా ఈ అంచనాల విశ్వసనీయత దెబ్బతింటూంది. భారతీయ సాంఘికరంగంలో కులం గతిశీలమూ, పరిణామశీలమూ అయిన అంశం. వెనుకటిలాగ కేవలం నాలుగు వర్ణాలుగానే సంఘం ఈ నాడు విభక్తం అయి లేదు. కాలక్రమేణ ఈ వ్యవస్థ మిక్కిలి సంకీర్ణంగా రూపొందింది. వివిధ కాలాలలో నూతన కులాలు ఆవిర్భవించడం జరుగకపోయినా, ఉన్న కులాలే వివిధ వర్ణాలుగా మార్పు చెందుతూ ఉండడం, క్రొత్త క్రొత్త పేర్లు పెట్టుకుంటూ ఉండడం జరుగుతూ వచ్చింది.

## కులాల పేర్లలో మార్పు :

1871లో జనాభా లెక్కల సేకరణ ప్రారంభం అయిన దగ్గరనుంచీ వేరు వేరు జనాభా లెక్కలలో వెలువడిన కులాల జాబితాలలో ఏ మాత్రం ఏకరూపత కనిపించడం లేదు. ఆరంభంలోని జనాభా లెక్కలలో పూర్తి భోగట్టా లోపించటంవలన, కులాల పేర్ల విషయంలోనూ, లక్షణాల విషయంలోనూ సరి అయిన పట్టికలు ప్రకటించకపోవడం వలన ఎన్నో తప్పులు దొర్లాయి. తరువాతి జనాభా లెక్కలలో, ముఖ్యంగా 1931 నాటి జనాభా లెక్కలలో దేశంలోని వివిధ ప్రాంతాలలోని కొన్ని కులాలు తమ తమ గౌరవం పెంచుకునే ఉద్దేశంతో తమ పేర్లను మార్చుకోడం కోసం విస్తృతంగా ఉద్యమాలు సాగించడం వలన తప్పులు దొర్లాయి. చిత్రం ఏమిటంటే - ఈ నాడు వెనుకబడిన కులాలుగా గుర్తింపు పొందడంకోసం ఆరాటపడుతున్న కులాలే ఒక దానితో ఒకటి పోటీపడి సంఘ మర్యాద పెంచుకోడం కోసం ఆడంబరమైన పేర్లు పెట్టుకున్నాయి. 'విశ్వ బ్రాహ్మణులు,', 'నాయీ బ్రాహ్మణులు', 'అగ్నికుల క్షత్రియులు' మొదలైన పేర్లన్నీ ఆ కాలంలో ఆ విధంగా ఏర్పడినవే! కాలక్రమేణ ఈ గౌరవంకోసం పెట్టుకున్న పేర్లన్నీ విస్మృతిపాలు అవుతున్నా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో కల్లు గీసుకునేవారు పెట్టుకున్న 'సెట్టిబలిజె' అనే పేరు మాత్రం ఇప్పటికీ నిలిచి ఉండడమే కాకుండా, వెనుకటి పేరు మరుగునపడి కొత్త పేరుకు ఆమోద ముద్ర లభించింది.

1931 జనాభా లెక్కల సేకరణకు ముందు 'కులాల విజృంభణ' ఉద్యమం సాగి వివిధ సాంఘిక

వర్గాల నాయకులు జనాభా లెక్కలను సేకరించే ఉద్యోగులకు ఫలానా కులం **వారవిగాక** ఫలానా కులం వారని తమను లెక్కలలో నమోదు చేసేట్టు ఆదేశాలు ఈయాలని 'మెమురాండం'లు సమర్పించారు. కులాలకూ, తెగలకూ పేర్లు మార్చి క్రొత్త పేర్లు పెట్టే అధికారం జనాభా లెక్కల సేకరణ ఉద్యోగులదే అయినట్టు వారు భ్రమపడ్డారు. అంతకు ముందు ఎన్నడూ ఎరుగనంత కులచైతన్యం రెండు విధాలుగా ఆరోజులలో అభివ్యక్తం అయింది. ఒకటి: గౌరవంగా ధ్వనించే ఒక క్రొత్త పేరును పెట్టుకోడం వలన సాంఘిక నిశ్రేణి (నిచ్చెన)లో ఒక మెట్టు పైకి ఎక్కగలమనే భావన; రెండవది · సంఘంలో ప్రతివర్గమూ తమ జనాభా సంఖ్యలో పెరుగుదలను ప్రకటించుకోవాలని యత్నిస్తూ ఉండడంతో ప్రజలలో జనాభా లెక్కల చైతన్యం ఎక్కువగా కనిపించడం. కుల వర్గాలలోని ఔత్సాహికులు రకరకాల క్రొత్త క్రొత్త పేర్లను పెట్టుకొని వాటిని జనాభా లెక్కలలోకి ఎక్కించాలని ప్రయత్నిస్తూ ఉండడంతో మద్రాసులోని 1931 జనాభా లెక్కల సేకరణ సూపరింటెండెంటు ఎమ్. డబ్ల్యూ ఎమ్. యీట్స్ ఈ క్రింది విధంగా వ్యాఖ్యానించడం జరిగింది: 'గౌరవ కుల నామాలను పెట్టుకోవాలని ఆరాటపడుతూన్న వీరి ప్రయాస నీటికోసం ఎండమావుల వెంట పరుగులు పెడుతూన్న వారిని గుర్తుకు తెస్తూంది. కులాల పేర్లు తగినంతగా స్థిరంగా ఉంటే తప్ప కులాలవారీ లెక్కలు నిజానికి నిరుపయోగాలు అవుతాయి. ఆ లెక్కలు నమ్మదగిన దరిదాపు అంచనాలు కూడా కాకుండా పోతాయి. కులాల పేర్లూ, అనుసరిస్తున్న మతాల భోగట్టా మారకుండా స్థిరంగా ఉంటే తప్ప కులాలకు సంబందించిన లెక్కలు ఉపయోగకరాలు కావు. ప్రస్తుతం విశేషణాలలో కనిపిస్తున్న పరిణామ లక్షణం నిశ్చయంగా అందుకు దోహదం చేయదు. జనాభా లెక్కలు ఉన్న నిజాలను తప్ప ఫేషన్‌లను ఉపయోగకరంగా వినియోగించుకోలేవు.''

ఒక కులం పేరుగా 'కాపు' అనే పదం పొందిన తీవ్రమైన పరిణామం ప్రస్తుత సందర్భంలో ముఖ్యంగా గమనించదగింది. కాపు అనేపదం 'కల్గుట' అనే పదంనుంచి వ్యుత్పన్నం అయింది చాలాకాలంపాటు ఈపదం తెలంగాణాలోనూ, మదరాసు రాజధానిలోని తెలుగు మాట్లాడే ప్రాంతాలలోనూ పొలం సాగుచేసే రైతు అనే అర్థంలో వాడుకలో ఉండేది 1921 జనాభా లెక్కల వరకూ రాయలసీమ, తెలంగాణాలలోని రెడ్లు అందరూ తాము 'కాపుల'మనే ప్రకటించుకునేవారు. ఒక ప్రత్యేక వర్గంగా ఏర్పడిన కమ్మవారు కూడా తాము 'కమ్మ కాపు'లమని చెప్పుకొనేవారు. 1931 జనాభా లెక్కలలోనే మొట్టమొదటిసారిగా హైదరాబాదు రాష్ట్ర రెడ్డిసభ రెడ్లను కాపులలోగాని 'కున్‌బి'లలోగాని చేర్చరాదని ఇండియా సెన్సస్ కమీషనర్‌కు అభ్యర్థన పత్రం పంపింది. అయితే రెడ్లలో అధిక సంఖ్యాకులు ఇప్పటికీ తాము కాపుల మనే చెప్పుకొంటున్నారు. వెనుక కాపులమని చెప్పుకునేవారు ఎప్పుడు ఏవిధంగా తాము రెడ్లు అని ప్రకటించుకోడం జరిగిందో ముఖ్యంగా పరిశీలించవలసి ఉంది. 'రెడ్డి' అనే పదం గ్రామాధికారి బిరుదం అని చాలామంది అభిప్రాయం. చిత్తూరులోనూ, కొన్ని కోస్తా జిల్లాలలోనూ గ్రామాధికారిని 'నాయుడు' అనడం కూడా కద్దు. తెలుగులో 'కాపు ముదిరితే రెడ్డి అవుతాడు' అనే సామెతను బట్టి తెలంగాణాలోనూ, రాయలసీమలోనూ కాపులలో సంపన్న కుటుంబాలవారు తాము 'రెడ్లం' అని చెప్పుకోడం ఆరంభించినట్లు నిశ్చయంగా చెప్పవచ్చును. రాయలసీమలోని 'బలిజెలు', తెలంగాణాలోని 'మున్నూరు కాపులు' (మున్నూరు శబ్దమే 300 కులాలు చేరి ఏర్పడిన కులం అని తెలియచేస్తున్నట్లు కొందరు భావిస్తున్నారు) హైదరాబాదులోనూ, మదరాసు రాజధానిలోని తెలుగు మాట్లాడే ప్రాంతాలలోనూ ఉన్న 'తెలగలు' ఎప్పుడూ ప్రత్యేక కులాలుగానే చూపించబడుతూ వచ్చారు. రెడ్లు మాత్రం కాపులుగానే నమోదు అయేవారు. ఈ నాడు కోస్తా జిల్లాలలోని కాపులను బలిజెలతోనూ, మున్నూరు కాపులతోనూ కలిపి గుర్తిస్తూ ఉండడం 1921 వరకూ కాపులుగా చెలామణి అయిన రాయలసీమ, తెలంగాణాలలోని రెడ్లను అలా గుర్తించకపోవడం కుల వర్గాలను గుర్తించడంలోని అవిశ్వసనీయతకు చక్కని ఉదాహరణ!

– Above Author is Secretary to A.P. Govt.